మ. మునుముట్టంగ నితండు సోమకుల నిర్మూలంబు సేయం గలం
డని సర్వేశు జటాటవిన్ [1] బ్రతికెఁ గా కంబేద లేకున్న నే
డనిలో సింగనరేంద్రపుత్ర యనవోతాధీశ నీకోప సం
జనితాగ్నిన్ బ్రబలంబు గంది యెరియన్ [2] జంద్రుండు లోఁగుండఁడే. 70

క. ఇను వెనుకే గ్రహచక్రము
వినుతామరనివహమెల్ల వెనకయ వెనుకే [3]
జనపతులు సాహసంబున
ననపోతనృపాల నీకు నందఱు వెనుకే. 71

సీ. అశ్వరేవంత నీ వశ్వంబు నెక్కిన
దండిరాజులగుండె తల్లడిల్లు [4]
ధరణిసౌభాగ్య నీతరవారిఘాతకుఁ [5]
గర్ణాటసేనలు గళవళించు [6]
సంగ్రామపార్థ నీచాపటాంకృతులకుఁ [7]
దెలుఁగు రాజ్యంబెల్ల దిగులుగొను
ప్రధన [8] నిశ్శంక నీబల్లెంపుధాకకు
నుల్కుల్కి పడుచుండు నోడ్రరాజు
నీవు తటిమినచోటను నిల్వలేక
సారిది [9] సురథాను రాజులు సొంపు దప్పి

---

1. B. సర్వేశ్వరుజటాటవిన్ బ్రతికె గాకంభోది
2. B. నీతోప సం।జనితాగ్నిన్ బ్రబలంబు గుంది మెరయన్
3. cf V. P. Sastri (Cmm i P 58).
   A. B. యిను వేనికి గ్రహచక్రము వినుతామరనివహమెల్ల వెనుకయ వెనుకే
4. V.V.C. p ii; A. B. గుండెలుతల్లడించు
5. Ibid; A.B. తరిని నీసౌభాగ్య తరవారిఘాతకు; తరి నీసౌభాగ్య తరువళిఘాతకు
6. ,, ,, కల్వరించు
7. V.V.C; A. B. వింటికింకిణులకు
8. ,, ,, బవర
9. ,, ,, సురది

రోటమందిరి[1] సింధూరికోటబైట
సన్నుతఖ్యాత రాయరా వన్నెగోత.[2] 72

క. ధరలోన రావుసింగయ[3]
వరతనయుం డన్నపోత[4] వసుధావరుచే
కరవాలమునం గూలిన
గురుతుగ నూటొక్కరాచకోటను వినుమా[5] 73

సీ. [6]ఆకొండరాఘవుం డనుకొండరాజును
గోవిందరాజు నా గోపరాజు
బలశాలి వీరహొమ్మళిదేవరాజును
బాణెమురాజు నాపాపరాజు
జూటూరిసూరుండు సారిది సోమలదేవు
పినరాజు చెన్నాజు బద్దిరాజు
అప్పచ్చిచెన్నాజు నారాఘవుండును
సాళ్వరాఘవ[7]రాజు సర్వరాజు
దిరుమలరాజును[8] తెలివి పిట్టలరాజు
నలకంపరాజును నరసరాజు

---

1. A. B. బల్యెమంది
2. The second part of the line is changed into ఖ్యాతియానగోత మన్నెరాజు by the authors of V.V.C.
3. A. B. రాయసింగయ
4. A. B. నాతనయుడానన్నపోత
5. A. B. వినుతా
6. The first seven lines are in a corrupt state in the Mss.
ఆకొండరాఘవుండును కొండరాజు బుక్కరాజు గోవిందరాజు
యాగోపరాజు బలశాలి వీహెంబను దేవరాజు సాణెమురాజు
యాపాపరాజు జూటూరిసూరుడు సారిదె సోమలదేవు
పినరాజు చినరాజు బెద్దిరాజు అప్పచిచన్నరాజు యారాఘవుండును
సాళ్వరాజును యాసర్వరాజును తిరుమలరాజు యాతెలివి
విఠలరాజు నలకంపరాజు యానరసరాజు
శ్రీరాఘుగౌతవిభూనాథుడనురాజు సంబెటకొండ్రాజు సకలరాజు
మాదిరాజు హరిరాజు మద్దెవరాజును అండ్రాజు పోల్రాజు నలఘురాజు
7. V.V. C. p. 32.
8. Ibid. తిరుమలపోల్రాజు

## వెలుగోటివారి వంశావళి.

శ్రీనాథుగౌతమీ। భూనాథుఁ డనురాజు
సాంబెట కొండ్రాజు । సలకరాజు
మాదిరాజ్ హరిరాజు । మద్దేవరాజును
నంద్రాజుఁ బోల్రాజు । నలఘురాజు
శ్రీపతిరాజు నా। చిన్నవల్లభ రాజుఁ
జినవంకిరాజు నా।కనక రాజుఁ
జినరాజుఁ జినసల్కుఁ । జిన్నబెత్తమురాజుఁ
బాశము చెన్నాజు । వాసిరాజు
వీరు మొదలు చాల[1] । విక్రమక్రమమున
నసహాయశూరులై ।ఁట్టి వారి
ఘనత కెక్కిన రాచ।గణము నూటొక్కరి
సోమవంశగ్రహాణ । సూను వెట్టి[2]
యనపోతనృపుఁడును । నామాదిభుఁడును
బలపరాక్రమమునఁ । బ్రతిఘటించు
రావువంశమునందు । రాహుకేతువులన
నతికోపమునఁ జుట్టి[4] । సూరులఁ బట్టి
యినుగుర్తికోటలో । మొనయు రాచకొమాళ్లఁ
దునియలుఁగాఁ గొట్టి । దోర వెట్టి
జల్లిప ల్లొద్దను । జలమును సాధించి
కలుగానుఁగల రాచ।గణము నాడి[5]
రక్తంబు మెదడును । రణభూతముల కిడి
రణముఁ గుడిపి పరా।క్రమము బెంచి[6]
యగ్రహారము భట్ల । కనుమగల్లిచ్చి యు
త్తమప్రతాపస్ఫూర్తిఁ । దనరఁ జేసి

1. A. B. వీరుమొదలయిగాడివిక్రమక్రమమున
2. ,, నూటొక్కర్న...గ్రహాణనూటివెట్టి. '్గ' in the word గ్రహాణ must be slurred over in pronunciation.
3. ,, బలపరాక్రమము నుగ్రతవహించి.
4. ,, రాహుకేతువులను నతిక్రోధమునజుట్టి
5. ,, చలము సంపాదించి...రాచకణమువాడి
6. ,, రణముగుడిపించి పరాక్రమమునమించి

శాసనంబులు వ్రాసి ఽ చలమున[1] నూటొక్క
రాజుల నీరీతి ఽ నాజిఁ గూల్చి
ప్రతిగండభైరవుఁ ఽ బలు తృప్తి యొనరించి
చలఁగి[2] ప్రతిజ్ఞచే ఽ జయము గొనుచు
మించి బిరుదంబు పచరించి ఽ మెఱసి రహాహా
ఘనత నల రావు సింగ భూ ఽ కాంతుసుతులు
... ... ...
[3]మహిని వెలసిరి యనపోత ఽ మాదవిభులు. 74

సీ. అతిగి రేఖాకారుఁ ఽ డై వెల్వెలం బాటి
కల్మషహృదయుఁ డై ఽ కాంతిఁ దొఱఁగి
రోగియై దోషాక ఽ రుండు నై విరహాయు
క్తజనాపకారి యై ఽ తనర నింగి
లీల మిత్రవిపత్తి[4] ఽ కాలవిస్ఫురితుఁ డై
కడుపక్షపాతియై ఽ వడిఁ జరించి
మింటఁ బొఱడువాని ఽ వెంటనే చని చంపు
టెంత పౌరుష మని ఽ యొదఁ దలంచి[5]
కరుణఁ గావ నోపఁ ఽ గాక లేకుండెనా
సోమవంశపరశు ఽ రాముఁ డనఁగ
వెలయు[6] నన్నపోత ఽ విభురావుమాదన
పొడుపుఁగొండ నేల ఽ పోవనిచ్చు. 75

సీ సోమకులం బెల్ల ఽ సోదించి పరిమార్చ[7]
శంభుండు శశి రేఖ ఽ జడలఁ గప్పె
సోమకులం బెల్ల ఽ సోదించి పరిమార్చ
నిందుండు తారల ఽ యిండ్లు సొచ్చె

---

1. A. B. చెరి.
2. The colloquial form చలఁగు is retained owing to the considerations of rhyme.
3. The third foot of the verse is missing.
4. A. B. విపంక్తి
5. A. త్తదలచి; B. యుక్తదలచి.
6. A. B. వెలసె
7. Each of the 4 lines has సోధించి పొరిమాల్ప

సోమకులం బెల్ల । సోదించి పరిమార్ప
బుధుఁడు సోముఁ దివిచి । పొమ్మపుఁగొనియె
సోమకులం బెల్ల । సోదించి పరిమార్ప
శశి క్షయమున వినా[1] । శమును బొందె
ఏచి[2] సింగమాద । డిందుకులం బెల్ల
నెదకి చంపు లెక్కఁగి । విభవ ముడిగి
వెండికట్టభౌతి[3] । పిఁకతో[4] నాకకాంత
విదియనాడు వొడిచె । వెలిచినట్లు. 76

చ. గజముఖ! యేమి చంద్రకడుఁ । గందితి వేటికి ? రావుమాదభూ
భుజుఁ డటు సోమవంశనృపపుంగవులం దెగటార్పఁ జొచ్చినన్;
నిజమును నట్లుకాదె ? మఱి । నేనును నేనుఁగమోమువాఁడనే[5]
గజదళసంహరుం డతఁడు । గాఁగఁ జలించెద నోసుధాకరా. 77

ఉ. వైరుల కాజి[6] మార్కొనఁగ । వచ్చునె సింగయరావుమాద జం
భారికి రావణారికి నరిగారికిఁ దారకవైరికిన్[7] మనో
జారికి సైంధవారికి బకారికి[8] దుర్మదవారణారికిన్
సీరికిఁ బన్నగారికి నృసింహుని బారికి నీకటారికిన్[9]. 78

సీ. పరశురాముఁడు తండ్రి । పగ[10]సాధ్యముగఁ జేసి
తరతర నృపతుల । తలలు నఱికె
సగరుండు తండ్రికై । పగఁగొని రోషించి
తాలజంఘాదుల । తలలు రాల్చె[11]

---

1. A. B. గాయంబున
2. ,, సింగవిభునిమాచి । డిందుకులంబెల్ల
3. ,, బాలతి
4. ,, వింక
5. ,, వాడనై
6. ,, వైరులనాజి
7. ,, యుగ్రకుమారికిన్
8. V. V. C. p. 50
9. ,, కైటభారికిన్
10. ,, p. 50
11. A. B. వ్రాల్చె

తఱిమి యశ్వత్థామ తండ్రికై యెంతయుఁ
దగఁ బాండుసైన్యంబు తలలు ద్రుంచె
మహిమీఁద సింగయమాధవోర్వీశుండు
తండ్రికై రాజుల తలలు గోసెఁ
గాక యిబ్భంగి సంగరాంగణమునందు[1]
వైరివీరుల గెలువ నెవ్వాఁడు చాలు
రామసగరు లశ్వత్థామ రణవిజయుఁడు
మాధవుఁడు[2] దక్క శూరులు మఱియుఁ గలరె. 79

సీ. ఖడ్గనారాయణు కాహళధ్వను లవె
యాలింపు వీరనారాయణాంక
దుష్టరంకుశు[3] బలోద్ధూతరేణువు లవె
రా దింక నిల్వఁ గోలాదిరాయ
ప్రతిగండభైరవు భయదకేతువు లవె
యుండరా దిఁక జగనొబ్బగండ
గాయగోవాళుని ఖడ్గదీధితు లవె
తలఁగుము గుజ్జరిదళవిభాళ[4]
వాఁడె సింగయమాదఁడు[5] వచ్చె వేగఁ
బాఱుతెండని రవుతులు చీరఁ బాఱె
భీతి నన్నవోతారెడ్డి బిరుదు లన్ని
వీటిఁబోవంగ[6] దన్నాలకోటబయట. 80

ఉ. దన్నలకోట ముందర[7] నుదగ్రబలోద్ధతి[8] గంగ దాఁటి సం
పన్నబలుండు సింగజనపాలునిమాదఁడు రెడ్డిపోతనిన్

---

1. A. B. సంగరస్థలమునందు
2. ,, రామసగరయశ్వత్థామ రణవిజయుఁడు మాధవుఁడు
3. ,, దుష్టరాంకుశ
4. A. గజ్జరి B. గంజరిదళవిభాళ
5. A. B. మాధవుఁడు
6. ,, వింటివోవంగ
7. V. P. Sastri. ముంగల. Sr. Sr. p. 51
8. ,,

బన్నిన సేనలం దునిమి పాఱఁగఁ ద్రోలె విరాటు వీట న
త్యున్నతవిక్రమంబున సుయోధనుఁ ద్రోలు కిరీటికైవడిన్. 81

ఉ. రా జని వేఁడుచో మొగము రాఁజగ నరులఁ జూచు నట్టి యా
రాజులు రాజులే పొలము రాజులు గాక ధనారికోటులన్[1]
రాజులఁజేసి భూమిఁగల రాజుల కెల్లను రాజ వైన[2] యో
రాజకులైక భూషణ విరాజితసింగయరావుమాధవా. 82

ఉ. ప్రాగ్రహారప్రతాపరణ భార్గవ రావనపోత నీవు ఘో
రాగ్రహ మెత్తి సోమకుల మంతయు ద్రోయుచు[3] సంహరింపఁగా
నాగ్రహవృత్తి మాని శశి తా హరుజూట[4]వనాటవీస్థలిన్
విగ్రహ[5]వృత్తి లేక తన వృద్ధియె కోరుచు నుండు నెప్పుడున్. 83

మ. చిరకాలవ్రతశీలుఁడై హరుఁడు కాశీతీర్థనిర్మగ్నుఁడై
స్థిరలీలన్ వృషభంబు నెక్కి రజ తాద్రిం జేరె ముక్కంటి యా
టరుదే సింగయ యన్నపోతవిభు బాహాఖడ్గనిర్మగ్నుఁడై
యరివీరుండు గజంబు నెక్కి టరుదా నాజన్ సహస్రాక్షుఁడై.[6] 84

క. వెస రిపుల కంఠర క్తము
ముసురుకొనియె నిందిరాల ముందటి బయలన్[7]
ముసి నిండి పాఱె నీచే
యసిధారల రాయరావు ననపోతాంకా. 85

మ. ఘనశౌర్యుం డగు మాధవాధిపుని ఖడ్గన్ భీతివిభ్రష్టసా[8]
ధనుఁడై దన్నులకోటయొద్ద ననపోతా రెడ్డి మానంబు సి

1. A B. ధనార్థకోటికిన్
2. ,, రాజులైన
3. ,, మెంతయు ద్రోయక
4. ,, జూడ
5. ,, నిగ్రహవృత్తి
6. ,, ధాత్రిన్ సహస్రాక్షుఁడై V.V.C.
అరివీరుండు గజంబు నెక్కి సురరాజౌటద్భుతం బెన్నఁగన్.
7. ,, ముసురుకొనెన్ ఇందిరాలముందరి బైలన్
8. V.V.C. p 56; C.V. Rao (AC iii p 39)

గ్గునుఁ బోనాడి రయంబునన్ బఱవ నా[1] కక్షోణిస్థలిన్ జూడ నేఁ
ధ్దును నచ్చో నడియాలమై కనవుపాకటున్ లేదు[2] త్రోవాటచేన్.[3] 86

ఉ. ఎత్తి పుటంబుఁ బెట్టి కుదియించి కళంకము దేర్చి కాఁకమై
నొత్తి ఘటించి లోహగతి నొండొక రీతికిఁ దెచ్చి వన్నగా
నత్తఱి నీపదాంబుజము నందియఁ బెట్టిన రాజు లందఱున్
మొత్తముఁ గట్టి నీ మలఁగు మోములు వేల్తురు రావుమాధవా.[4] 87

సీ. పశ్చిమదేశభూపతు లంపు పన్నీరు
ఘనధారఁ జేతులు గడుగు నపుడు[5]
గూడెంపు[6] దొరలు మక్కువ నంపు జవ్వాది[7]
చమురు జొబ్బిలఁ బట్టి చమురు నపుడు
రాయ లంపిన గంబురాల[8] కర్పూరంబు
మించు వాసనల వాసించు నపుడు
గజపతి యంపిన కస్తూరి వీనెల
నికరంబు లెస్స దానించు నపుడు
మానదేలూరు[9] ఝుంగిలి ఖానరవుతు
దసర పైఁ బడి యాజిలోఁ గానుము నట్టి[10]
రావు సింగయ మాదకర ప్రతాప[11]
ఖడ్గశార్దూలపోతంపుఁ గురు కంపు. 88

1. V.V.C. p 51
2. A. B. లేవు
3. V.V.C. p 51; A. B త్రోవాటనై
4. ,, మొత్తము గట్టి నీటొలుకు మోములు వెల్తురు నిక్కమింతయున్
A. B. మొత్తముఁ గట్టి శీమలకు మోములు వెల్తురు రావుమాధవా.
5. A. B. చేతపులకడుగునపుడు
6. ,, గుఢెంపు.
7. ,, జవ్వాజి జమరు
8. A. గంబూరాల, B. గబూరాల
9. ,, మానదెలూరుఝుగిలిఘానునారత
10. ,, నురుడైపడ
11. ,, దొరరావు మాధవనాయకరప్రతాప

క. లావున సింగయమాధవు
వావిరి మార్కొన్న శత్రువర్గము కెల్లన్[1]
భావింప[2] మూఁడు త్రోవలు
చావొండెను బాఱుటొండె[3] శరణను టొండెన్[4]. 89

సీ. సరసమాధుర్యవా చాస్ఫుటపటహాది[5]
విమలపాఠకఘుమ ఘుమరవంబు
హరిదంత[6]సేవాస మాసన్నరాజన్య
విజ్ఞాపనావచో వినయరవము[7]
కవిరాజపరమభాగవతదైవజ్ఞాని[8]
గాయకపణిహారి కలితరవము[9]
రతిరాజరాజేంద్ర రాజపణ్యాంగనా[10]
చరణనూపురఝుళం ఝుళరవంబు
హృద్యమంగళసంధాయి వాద్యరవము
శోభితం బగు రాజవే శ్యాభుజంగు
గాయగోవాళు రావుసింగయకుమారు
మాధవేంద్రుని యాస్థాన మంటపమున. 90

ఉ. పాఱని రాజులున్ నిగళబంధనులై చెఱసాలలోనికిన్
దూఱని రాజులున్ సిరులు దుర్గములున్ వెస నిచ్చి వెన్కకై[11]
తాఱని రాజులున్ గలరె ధారుణి సింగయమాద నీ పనిన్[12]
మీఱి సమస్తమైన ధరణీవరకోటుల వేఁట లాడఁగన్.[13] 91

---

1. V.V.C. p. 49 వర్గంబునకున్
2. A. B భావించి
3. ,, పోరుటొండె
4. ,, శరణనుటొండే ; V.V.C. p 49 శరణంబొండెన్
5. ,, పటుహ
6. ,, హరినిమ్న
7. ,, విజ్ఞాఫణీవచోవీనిధరము
8. ,, దివ్యక్షాళి
9. ,, ఫణికలికారితసము
10. ,, మాణాంగనా
11. V.V.C. p 51; A.B. యెక్కకే
12. ,, p 51 మాధవుండనిన్
13. A. B. కోట్లను వేటలాడగా

ఉ. ఒక్కఁడు జారముఖ్యుఁ డొకఁ డూఱక రాఁజుఁ[1] బరేతపాలకుం[2]
డొక్కఁ డొకండు రాత్రిచరుఁ డొక్కఁడు చాలజడుండు చంచలుం
డొక్కఁ డొకం డసభ్యుఁడగు[3] నొక్కఁడు భిక్షుకుఁ డేటిదిక్పతుల్
దిక్కుల కన్నవోత[4]జగ తీతలనాథుఁడె దిక్కు[5] మేదినిన్. 92

సీ. గౌరిజరాయిడిచేతఁ గుందిన దేహంబు
పరిరంభణంబులఁ బదిల పఱచి
విసపుఁ గోఱలచేత వేఁగిన యధరంబు
చుంబనక్రీడలఁ జొరవఁ జూపి
మదఘీంకృతులచేత బెదరు పుట్టిన చెవుల్
దియ్యంపు మాటలఁ దీపు నెఱపి
కర్కశస్పర్శలఁ గందిన పాలిండ్లు
చిన్ని చేపిడికిళ్ల చెలు వొనర్చి
పంది నదలించి[6] చాతురి[7] పాము డించి
యేనుఁగుల నెక్కి[8] తాఁబేటి తేనిఁ ద్రొక్కి[9]
వసుధ నీమూఁపుప్రాపున నెసఁగ[10] నార
యన్నవోతాంక ఖడ్గనారాయణాంక. 93

సీ. పాతాళఫణిసార్వభౌముని పడగలుఁ
గకుబంతమదగంధకరులు సాటి
కకుబంతమదగంధకరితల్లజంబులుఁ
గలశాబ్ధికల్లోలఘటులు సాటి

1. V.V.C. p 42 రోజు
2. „ ; A. B. పరైకపారగుం
3. A. B. యభ్యసుడు వొక్కడు ; V.V.C. p 42 యతుఘనుఁ డొక్కఁడు
4. A. B. and V.V.C. p 42 దిక్కులనన్నవోత
5. V.V.C. p 42 దక్క
6. A. పందినదండించి ; B. పందినదడించి
7. A. B. చాతరి
8. „ పిక్క
9. „ దక్కి
10. „ నొసంగనార

కలశాబ్ధికల్లోలఘటల బిబ్బోకంబు
లమృతాంశు కిరణగుచ్ఛములు[1] సాటి
అమృతాంశుకిరణగుచ్ఛాడంబరంబులు[2]
వారిజాసనువారువములు సాటి
వాని వానికి[3] నివి సాటి వచ్చుఁగాని
సకలభువనైకమహాకీర్తికచ్ఛత్ర[మనఁగఁ]
బరిఢవిల్లిన నీకీర్తి సాటి రావు
అన్నపోతాంక వీరనారాయణాంక. 94

ఉ. మత్తుఁడు కూర్మరాజు విషమత్తుఁడు నాగవిభుండు మిక్కిలిన్
మత్తుఁడు సూకరాధిపుఁడు మత్తగజంబులు తిండిపోతు లీ
తొత్తడిఁగాపురంబు తులఁదూఁగ[4] దటంచును రత్నగర్భ దాఁ[5]
బొత్తుల నీభుజాబలము పొందెను రావనపోతభూవరా. 95

సీ. ఘనకపాలంబులు కాయలు గాఁగను
వాలుఁజెవులు బైసికేణీలుఁ గాఁగఁ[6]
గోలెమ్ము[7] వళువుగ బాళిక చర్మంబు
నందుఁ గీలించిన యనుచులుగను
బెనుపొంద నాసికయును సరస్వతి గాఁగ
దట్టంపుఁ బ్రేవులు తంత్రులుగను
గరరుహంబులు జీవగఱ్ఱలు గాఁగను
జత్రుచయంబులు[8] సారెలుగను

1. B. గుంభములు
2. ,, గుభాడంబరములు
3. A. B. వాంటివాటికి
4. V.P. Sastri, Cmm. i. p 57 ; A.B. తలదూఁగ
5. ,, ,, గర్భనీ ; A. గర్భతా, B. గర్భడా
6. A. B. బవిసినీలు
7. ,, కోలెంపు
8. ,, శత్రుచయంబు

వెలయువీణ పట్టి వేడ్కలు తెగ లొత్తు[1]
భూతకోటి పాడు[2] భూతయశుని
సింగభూపతనయు సంగరాభంగుని
యన్నపోతభూతలాధిపతిని. 96

క. భూపతులు నీకు సరి గాఁ
జూపట్ట రమక్క తెనుఁగు సురథాని వహా
గూపజయంతత యమరెను[3]
శ్రీపతిసమ్మోద రావుసింగయమాదా. 97

క. వింతే సింగయమాధవ
చింతింపక రాచకోట్ల శిరములఁ ద్రుంచఁగ[4]
ఎంతే కాలము జరిగిన
సంతెంబరగండబిరుదు నాహృతి గొనుటన్.[5] 98

వ. జల్లిపల్లికడ[6] రాజులఁ జంపి రణము గుడిపించి చలమర్తిగండ బిరుదును[7] సోమకులపరశురామ బిరుదును,[8] సింహతలాట బిరుదును[9] సంతెంబర గండ, ధరణీవరాహ, చౌహత్తుమల్ల బిరుదులును[10] వహించి, భీమవరముకడఁ గాపానేనిఁ జంపి[11], ఖడ్గనారాయణ, గాయగోవాళ, హిందూరాయసుర త్రాణ బిరుదులును[12] వహించి, దన్నాలకోటకడ[13] రెండుమాఱులు రెడ్లవారిని గెలిచి జగనొబ్బగండ, సంగ్రామధనంజయ, రాజవేశ్యాభుజంగ బిరుదులు దెచ్చినవారు రావు అనపోతానేఁడును[14], మాదానేఁడును[15], రాజుకొండ,

1. A. B. జగలొత్తు
2. „ వాని
3. „ రూపజయంతంబమరెను
4. „ ద్రుంచటు
5. „ ఆహూతిగొంటివి
6. „ కాడ
7, 8, 9, 10. B. A. న్ను
11. A. B. భీమవరముకాడ కాపానేన్ని
12. „ యిందూరాయ సురత్రాణబిరుదున్ను
13. A. గాడ ; B. కాడ
14. A. B. న్ను
15. „ న్ను

దేవరకొండ [యనునీ] రెండుపురంబులు పంచుకొని రాజుకొండ యన పోతానేఁడును[1] దేవరకొండ మాదానేఁడును[2] ఉంచుకొనిరి. ఆమాదానేని కుమారుఁడు పెద్దవేదగిరినేఁడే వేములకొండకడ[3] సత్యగదేవుని, జాళిక్య దేవుని, గన్నడదేవుని, గంకాళదేవుని, నుదయనదేవునిఁ గొట్టి[4], వేముల కొండ రణరంగస్థలవైరిరాజజీమూతపవన, యేకశిలానగర[5] సమీపశాత్రవ రాజన్య[వనదహనదావానల], బెండపూడి[6]విభాళ బిరుదులు[7] వహించిన వాఁడు. [8]ఆపెదవేదగిరినేనికి రామచంద్రుఁడును, కుమారమాదానేఁడును పుట్టిరి. అం దగ్రజుండు: 99

సీ. కుంట్లూరియిమ్మడిఁ గూల్చిన యెఱపోచ
భూతలాధిపుఁడు[9] మీతాతతాత
అనిలోన మచ్చగన్నయను ద్రుంచిన సింగ[10]
ధారుణీశ్వరుఁడు మీతాత తండ్రి
తోడరి భండారుముమ్మడి వధియించు మా
ధవభూమిభర్త మీతండ్రితండ్రి[11]
గుండ్రదండ్రాయనిఁ[12] ఖండించి సన్నుతి
గాంచు వేదగిరి నిన్గన్నతండ్రి[13]

---

1. A. B. అనపోతానేడు
2. ,, మాదానేడు
3. ,, కాడ
4. ,, దేవులగొట్టి
5. ,, యేకశివానగర
6. ,, బెండెపూడి
7. ,, బిరుదు
8. ,, రావు పెదవేదగిరినేడు These words are superfluous.
9. V.V.C. p 53; A. B. భూభర్త
10. ,, ; ,, ద్రుంచుయాసింగ
11. A. B. మాధవాభూభర్త; V.V.C. p 53 ముమ్మడిని నాజి నడంచితనరు
12. ,, గుండ్రగుండ్రాయుని
13. ,, ఖండించిసన్నుతి గాంచు పెదవేదగిరి నిన్ను గన్నతండ్రి. V.V.C. p 53 సన్నుతి గాంచుటఁ బరఁగ నిన్గన్నతండ్రి

కడిమిమై నీవు తగఁ బండికనుమ యొద్దఁ
బరగఁ బేరోజి సురథాను పరిణమింపఁ[1]
గదనమున నౌర గెల్చితి కన్నడీల
రమ్యదేవేంద్ర వేదయ రామచంద్ర. 100

వ. అతని యనుజుండు. 101

ఉ. దేవరకొండయొద్ద నతితీవ్రపరాక్రమవిక్రమంబునన్
జేవ దలిర్పఁగా జయము చేకొని యాయెఱకృష్ణరాయనిన్
భూవినుతంబుగా నటికి భూతగణంబుల[2] కుత్సవంబుగా
వావిరిఁ జేసె నౌర! కులవర్ధనుఁడైన కుమారమాదఁడున్. 102

వ. దేవరకొండమీఁదికి నెత్తివచ్చిన యెఱకృష్ణరాయనిఁ జంపి జయము గాంచి, పందడాధీశుని గెల్చి వరగొండదుర్గంబును గొని హొన్నగట్టు కుదిరెగట్టు మండలీకరగండ బిరుదును, ఎరుకవరప్రాంతంబున[3] మన్నె జంగిలిఁ గొట్టి పనిఘానరాయ, బసవశంకర బిరుదులను[4] వహించినవాఁడు కొమారమాదానేఁడు. ఆమాదానేనికి పినవేదగిరినేఁడును, లింగమనేఁడును బుట్టిరి. అందగ్రజుండు. 103

చ. అరయఁగ వీఁగె నింద్రగిరి నారయ శూలిగిరిన్ జలించె మం
దరగిరి జర్జరం బిరిగె దా మయినాకగి రీఁగె వార్ధిలో[5]
ధరణి నొదింగె[6] వింధ్యగిరి తక్కుగిరుల్ కపు లూఁచ నింక నే
గిరులు కొమారవేదగిరి కీటుకు[7] రావలె ధీరతోన్నతిన్. 104

ఉ. మానుగఁ గోమటన్నయన[8] మాచన పుత్త్రకళత్రమిత్రులన్
గానఁగఁ జూడఁగా దనుచుఁ గాల్చిరి వారల నిష్టపాత్రులై(?)[9]

---

1. V.V.C. p 53 పరిభవించి
2. A. B. గణాలకు
3. ,, ప్రాంత్యంబున
4. ,, బిరుదు
5. ,, వార్ధికిన్
6. ,, ధరణినొదింగె
7. ,, సాటికి
8. ,, కోమటన్నయను
9. ,, నిమ్నపాత్రులై The meaning of the first two lines of the stanza is not quite intelligible.

పూని కౌమారవేదగిరి । పుణ్యపరుండవు నీకుఁ బాడియే
పీనుఁగుఁ జూడఁగా దనుట[1] । భీమునియన్నవు సత్యసంపదన్. 105

ఉ. వేమనతోడఁబుట్టు వఁట । వింతలు నేఁ డవిగాక మానెఁబో[2]
కోమటివాని బిడ్డఁ డఁట । గోశకుఁడున్ గృషిచేయువాఁ డిఁకన్
భూమిఁ గుమారవేదగిరి । పుణ్యపరుండవు నీసమత్వమం
[3]దేమని చెప్పవచ్చు గుణహీనుని కోమటిరెడ్డిమాచనిన్. 106

వ. ఆకొమారవేదగిరినేఁడే యనవేమారెడ్డి తమ్ముని మాచారెడ్డినిఁ గొట్టి తమ్మపడిగానఁ బొదిగించిన, నాయనవేమారెడ్డి పినవేదగిరినేనిఁ జంపి తమ్మపడిగానఁ బొదిగించి సింహతలాట బిరుదును బుచ్చుకొని యుండిన, వేదగిరినేని తమ్ముఁడు లింగమనేఁడే ద్వాదశవర్షంబుల వాఁడై యుండి, తనబంధువర్గంబుల హితపరిజనంబులఁ గూర్చుకొని యమరులకు విక్రసంబగు యుద్ధంబుఁ జేసి యనవేమారెడ్డినిఁ గొట్టి తమ్మపడిగానఁ బొదిగించి సింహతలాట బిరుదును దనచేత శ్రీనాథుఁ డడిగి కొంచుబోయిన 'నందికంతపోతరాజ' ను కఠారిని బుచ్చుకొనెను. అంతకు ముందె యనవేమారెడ్డికిఁ బెద్దలు పిన[4]వేదగిరినేనిఁ దమ్మపడిగానఁ బెట్టవద్దని బుద్ధిక్రమంబుగాఁ జెప్పిన విధం బెట్టి దనిన.

సీ. దన్నాలకోఁ దొద్దకేసన్నపోతారెడ్డి
తా విఱుగు తలంపుఁ । దలఁప వైతి
సింగయామాధవుఁ । జేరిన యనవేముఁ
డోడి పాటు[5] కొఱంత । చూడ వైతి
కొమరగిఱెడ్డికిఁ । గోరి సింగయమాదు
తనరఁ బెట్టిన బొమ్మఁ । దలఁప వైతి
సురథాను మన్ననఁ । జూచుకొంటివి గాని
వారితో దొరయుట । వలవ దనవు

---

1. A. B. పీనుగజూడగాదనుచు
2. ,, చో
3. A. బేమని
4. A. B. పెద
5. V. P. Sastri ; A. కోటపెల్లని

అనుపమంబుగఁ గోమరవేదాద్రి నిట్లు
ఘనతరంబుగఁ దమ్మపద్గమునఁ బెట్టి
దొరల[1] బుద్ధుల విని యిటు[2] దొరలఁ బడియు
విన్నఁబడితివి పెదకోమ టన్నవేమ. 108

వ. ఆలింగమనేనిచేత శ్రీనాథుఁడు నందికంతపోతరా జను కఠారిని గొంచుపోయిన పద్యము. 109

సీ. జగనొబ్బగండాంక సంగ్రామనిశ్శంక
జయసిద్ధి[3] రాయవేశ్యాభుజంగ
అఖిలకోటలగొంగ యరిరాజమదభంగ
మేలంకు ధరణీశ మీనజాల
మూరురాయరగండ మూఁరియు[4] రాజులమిండ
యభివృద్ధి రాయచౌహత్తుమల్ల
ఘనగాయగోవాళ కామినీపాంచాల
బ్రహ్మయు శశివంశ పరశురామ
దండిబిరుదుల సురథాణి గుండెదిగుల
భళిర యల్లయవేముని పరఁగుమిండ[5]
రమణ మించిన మేదినీ రావుబిరుద
సంగరాటోప మాదయ లింగభూప. 110

వ. ఆలింగమనేఁడే సోమకులమురాజులు మొదలయిన రాచవారినెల్లఁ గొట్టి[6] కాలిపెండానఁ బొదిగించెను.[7] అనవేమారెడ్డి మొదలయిన పంటవారి నెల్లఁ గొట్టి[8] తమ్మపడిగానఁ బొదిగించెను.[9] కాలిపెండానఁ[10] బొదిగియున్న[11]

1. A. B. రాయరుల
2. ,, యిల్లు
3. A. జయశుద్ధి ; V. P. Sastri, Sr. Sr. p 132 జగతీశ
4. A. వరుయు ; B. మువురు
5. A. B. పరుగ ; V. P. Sastri పగర
6. ,, నెల్లాగొట్టి
7. ,, పొదిగించను
8. ,, నెల్లాగొట్టి
9. ,, పొదిగించను
10. ,, పెండేన
11. B. పొదిగిలన్న

సోమకులమురాజులును,[1] దమ్మపడిగానఁ బొదిగియున్న[2] పంటరెడ్లును
దమలోఁ దాము[3] భాషించుచున్న విధం బెట్టి దనిన. 111

శా. శ్రీలాలిత్యుఁడు రావులింగనృపతిఽశ్రీపాదపద్మంబునన్
వేలేరాజులు కొంద ఱల్లయ[4]సుతుంఽ వీరాంకుఁ జూపింత్రు వీఁ
డేలా కంపము నొందె[5] భీతి నదిగాఽ దీకాఁపు జాణండు దాఁ
గాలంజింగల[6] తమ్మ మెక్కి వణఁకున్ఽ గర్పూర ము న్నెక్కినన్. 112

సీ. వగరు మిక్కిలియైన ఽ వరువట్టు బాగాల
కసటు యఃహావెళ్లఁ ఽ గ్రాసి క్రాసి[7]
చిరుమన తెల్లాకుఁ ఽ జిగురులు కుత్తుకఁ
దగిలిన హాహ్వాని[8] ఽ దగ్గి దగ్గి
వెస మ్రింగఁ దాంబూలఽరసము వెగ్గలమైన
నోక్కని పలుమారు ఽ లోకిలించి
పచ్చకర్పూరంపుఁ ఽ బలుకుల లాహిరి
హెక్కని[9] సారెకు ఽ సొక్కి సొక్కి
వెలరి యుహ్వాన నూదుచు[10] ఽ వేమవీర
భద్రు లుందురు[11] నీతమ్మ ఽ పడిగమందు
గాయగోవాళ బల్లర ఽ గండబిరుద
యంగభవరూప మాదయ ఽ లింగభూప. 113

ఉ. అంచిత రాయరావుబిరు ఽ దాంకము రాజులఁ గొట్టి యుండెఁ గీ
లించిన మాదభూవిభుని ఽ లింగనృపాలున కొప్పఁగాక గ

---

1. A. B. న్ను
2. A. పొదిగున్న ; B. పొదిగివున్న
3. A. B. తమరున్ను
4. ,, కొండరళ్ళయ
5. A. నుండె
6. A. గాలంజందుల B. దాలాంజందుల
7. A. B. ర(క)సటు అఃహావెళ్ల గాసికాసి
8. ,, చిరువాని......హాఃహాఃన
9. ,, యిస్సిని
10. ,, వెలయవ్వూహానునూదుచు
11. ,, వేమవీరభద్రులుండునీ

ర్పించిన నీకుఁ జొప్పడునె ఽ వేమరు నల్లయవేమరెడ్డి పో
కొంచెపుఁ దమ్మలిండి తిను ఽ కూళకు[1] సింహతలాట మేటికిన్. 114

ఉ. భూపవరుండు మాదనృప ఽ పుంగవులింగన రత్ననూపుర
స్థాపితులైన రాజకుల ఽ సంఘము లల్లయవేము నంద్రుడు నీ[2]
వేపున లజ్జ పోవిడిచి ఽ మేటికి వచ్చితి తమ్మగుర్లతోఁ
గాఁపన నీవు నందెఁ బద ఽ కైకొను నుల్లట నొక్క చెంగటన్.[3] 115

ఉ. ఆజిముఖాతి[4]భీతులగు ఽ నల్లయవేమన వీరభద్రుఁడున్
రాజకులాభిరామ రణ ఽ రాఘవ లింగనృపాల నీమహా
రాజతపాత్రఁ దమ్మఁ దిని ఽ రాజ్యము నిల్పిరి యింక నే మనన్
రాజమహేంద్రదుర్గములు ఽ రాజులు గైకొనకుండఁ జూతురే. 116

ఉ. వాదులు వాద[5]విద్యల సు ఽ వర్ణము గాంచుట యద్భుతంబె యీ
మాదయ లింగశౌరి గరి ఽ మంబుగ నల్లయవీరభద్రుఁడున్
వాదముచేసి దేహము సు ఽ వర్ణమయంబుగ వాని యందియున్
ఖేదము దక్కి యుండు[6] దల ఽ క్రిందయి వ్రేలుచు విఱ్ఱవీఁగుచున్. 117

ఉ. బల్లరగండలింగవిభు ఽ పాదమునందుఁ బసిండియందె తా
ఘల్లురు ఘల్లుఘల్లు రన ఽ ఘల్లని మ్రోయఁగ భీతి గుండియల్
ఝల్లురు ఝల్లు ఝల్లు రన ఽ ఝల్లన నల్లలనాడు చుందు రా
యల్లయరెడ్డివేముఁడును ఽ నాతనితమ్ముఁడు వీరభద్రుఁడున్. 118

సీ. ఏఁపున గంగ దాఁ ఽ టెల(?)రెడ్డిపోతని
దనరార గెల్చె మీ ఽ తండ్రితాత
యెలమి రాజులఁ గొట్టి ఽ యెఱకృష్ణరాయని
తలను[7] ఖండించె మీ ఽ తండ్రితండ్రి
బలిమిమై నాజిలోఁ ఽ బందడాధీశుని
గడువడి గెల్చె ని ఽ న్నతండ్రి

---

1. A. B. తినుగూటకు;
2. ,, వేమనేంద్రదా
3. ,, కాపననీవునందె పదకైకొని అల్లటనొక్క చంగటక్
4. ,, ఆజిముఖాది
5. ,, వాదులలువాడ
6. ,, యుండి
7. ,, తలలను

ఖానుసూరినిమల్క । గదిమి మీయన్నటు
లరువపల్లొద్దను । నమర గెల్చె
మలయఁ గృష్ణకడను । మాఱ్కొని నిల్చిన
కన్నడీల[1] నెల్ల । గదిమి తౌర
మాధవేంద్రపుత్ర । మహనీయచారిత్ర
సంగరప్రతాప । లింగభూప. 119

సీ. ధాత్రి మీముత్తాత । తండ్రె[2]ఱ్ఱదాచండు[3]
తనివారఁ బాండియ[4] । దళము గెల్చెఁ
జెలఁగి మీముత్తాత[5] । సింగక్షితీశుండు
కాపభూపతి గెల్చెఁ । గదనమునను
ధట్టించి మీతాత । తండ్రిమాధవుఁ డాజి
నన్నపోతారెడ్డి । యద టణంచె[6]
విజయియై[7] మీతాత । వేదగిరీంద్రుండు
దిక్కులఁ దనయాజ్ఞ । దీటుకొలిపె
మెఱసి లోక మెఱుఁగ । మీతండ్రి మాధవ
క్ష్మాధిపుండు గెల్చెఁ । గన్నడీలఁ
దోడరి చలమచర్ల । దుర్గంబు గొంటివి[8]
ధరణిలోన లింగ । నరవరేణ్య. 120

సీ. అదలించి మీతాత । యన్నపోతారెడ్డి
దన్నాలకోటొద్ద । వెన్నుఁ జూచెఁ
దనర మీపెదతండ్రి । దాచభూపాలుండు
కొమరగిరికి బొమ్మఁ । గోరి పెట్టె[9]

---

1. A. B. ఘన్నడీల
2. ,, తండ్రెఱ ; V.V.C. p 58 తాతెఱ్ఱదాచాఖ్యుఁ
3. ,, దాచాంకు । తనివార ; V.V.C. p 58 చెలఁగి తాతఘఁదాత
4. ,, పాండ్యయ
5. ,, చలగిమీ(ముత్తాత)
6. ,, యదటణంచ ; V.V.C. p 58. దట్టించి మీతాతతండ్రి మాధవనృపుం డన్నపో
తారెడ్డి నాజిఁదునిమె
7. ,, విజయుడై V.V.C. p 58 ;
8. ,, వర్గంబుగొంటివి
9. ,, గీలుకొల్పె

మీాయన్న వేదాద్రి ౹ మెఱసి కోమటిమాచ
విభుఁ దమ్మపడిగాన ౹ వెలయఁ బెట్టఁ
బరఁగ నీ వేడేండ్లఁ[1] ౹ బంటక్షత్రియులకుఁ[2]
బొగడొంద వలపుల ౹ బొజుఁగవైతి
వనఁగ వినుతికెక్క ౹ తాంధ్రగౌళ [మరాట]
భోటమగధకుకుర ౹ భూపులందు[3]
మాధవేంద్రపుత్ర ౹ మహనీయచారిత్ర
సంగరప్రతాప ౹ లింగభూప. 121

సీ. ఎలమి మీాపెదతాత ౹ యినుగుర్తియొద్దను
రాజుల వెసఁ జంపి ౹ రమణ మెఱసె
నలచోడభక్తీంద్రు ౹ ననదేవరాజును
బెంపారఁ గాచె మీా ౹ పిన్నతాత[4]
దేవరకొండొద్దఁ ౹ దెగువమై మీాతండ్రి
యెఱకృష్ణరాయని ౹ శిరము ద్రుంచె
మీాయన్న వేదాద్రి ౹ మెఱసి కోమటిమాచ
విభుఁ దమ్మపడిగాన ౹ వెలయఁ బెట్టె
మొనసి నీవు మఱియు ౹ మును గంగకాడను[5]
బోయగముల నెల్లఁ ౹ బ్రోచి తౌర[6]
మాధవేంద్రులింగ[7] ౹ మనుజేంద్ర నీసరి
యెన్నఁగలుగు నృపతు ౹ లేరి[8] చెప్ప. 122

సీ. (?) అహ ఖాను ఖాను మేజ౹యామారుఖేతరు
మెరుఖుదె ఖుదెయను౹తురకవారి
(?)గోసాయి బణెతలె౹ఖోణజయాభాయి
ఆతమా లేఖను౹నారెజనుల

---

1. A. B. వేడెండ్ల
2. ,, క్షత్రిలకు
3. ,, నృపులయందు
4. ,, అలచోడ భట్టేంద్రు నలదేవరాజును పెంపారగాంచె మీా పిన్న తాత
5. ,, మొనసినీవుమొన్న మురియుగంగ కాడ
6. ,, మిగులగాచి
7. ,, లింగయ
8. ,, యెన్నగలనృపతులేమి

ఎడ బిడదన నహో । నోడబారలేనాను
మున్నెఱిగెదె నను । కన్నడీల
రేచర్లసింహంబుఁ । జూచెదమని మహా
ధీరతల్ పలికెదు । తెలుఁగుభటుల[1]
నెల్లఁ బాఱఁదోలి[2] । యేలితి భూమెల్లఁ
బోల్ప సరియె నీకుఁ । బుడమిపతులు
మాధవేంద్రపుత్ర । మహనీయచారిత్ర
సంగరప్రతాప । లింగభూప. 123

ఉ. ఎత్తినకోపవృత్తి మద । మెత్తి తురుష్కులఁ బాఱఁదోలి యా[3]
మొత్తములైన దుర్గములు । ముప్పదిరెండును నొక్కధాటినే
యత్తఱిఁ గొన్న రాజవిల । యాంతక[4] మాదయలింగశౌరితో
నెత్తొరలేని భూపతుల । నెన్నఁగ నేల[5] ధరాతలంబునన్. 124

వ. ఆలింగమనేఁడు యొకనాఁటిధాటిని ముప్పదిరెండు దుర్గములు పుచ్చుకొని యేకధాటీసమర్థ విషమధాటిపాంచాల, చతురుపాయదక్ష[6], రిపుప్రళయాంతకోపేంద్ర, యష్టదిగ్రాజమనోభయంకర, యవఘళరాయమానమర్దన, మేదినీరాయదుష్టగజాంకుశ, కోటలగొంగ బిరుదులను వహించి, రాజుల, రెడ్డిబిడ్డలఁ గాలిపెండానఁ జెక్కించి, మూరురాయరగండపెండారంబు డాకాలఁబెట్టి, సంగమరాయల నాగులపాటొద్దఁ గొట్టి, రాయవేశ్యాభుజంగ బిరుదువహించినవాఁడు.[7] 125

సీ. శ్రీమల్లికార్జున । సేవాసమారూఢి
నిత్యవైభవలీల । నెగడినాఁడు

---

1. A. B. అహాఖోణు ఖోణుమెజ యమారు ఛేత్ర్యమె రుఖుదె ఖుదె యనిరొదు
రహితవరులు
గోసాయుబలతలె ఖాణుజారేఖాయు ఆతతలె ఖనిరి నారజనులు
యడబెడదనె నహో నొడబారెడనాను మున్ను హెర దనెడి ఖన్నడీలు
రేచర్లసింహ్వమని చూచదమని మహాధీరుతులు బలికిరి దెలుంగుభటులు
2. A. యల్లపారదోలి ; B. యల్లిపారబోలి
3. B. దోలినయంతజేగయా
4. A. B. రాజన్పలకాంతుడు
5. ,, నెత్తొరలేరుభూపతులు యెన్నగలేరు
6. ,, తతురోపాయ
7. The subject రావులింగమనాయండు is repeated in the Mss at the end of the passage.

## వెలుగోటివారి వంశావళి.

కొమరొప్ప రేచర్ల । కులవార్ధిచంద్రుఁడై
మేటిరాజన్యుల । మించినాఁడు
దినము షోడశదాన । దీక్షాగురుండునై
తనకీర్తి దిక్కులఁ । దనిపినాఁడు
ప్రతిగండభైరవ । ప్రకటమేదినిరావు
బిరుదుల విఖ్యాతిఁ । బరఁగినాఁడు.

... ... ...[1]

వచ్చి చాళిక్యజు।వ్వండు దాఁకిన నిల్చి
యడవెల్లి చోరఁబాఱ । నడచినాఁడు
పరికించి జయసింగు । భంజించి యోరుగ
ల్లెఱుఁగంగ సిరివోలు । నెక్కినాఁడు

... ... ...

ఏపున రాజు కొం।డెక్కి సంగరమున
మునుగంటి ముమ్మని । మొత్తినాఁడు

... ... ...

గణపవరంబెక్కి । కడు విక్రమంబునఁ
గోనకోటారెడ్డిఁ । గొట్టినాఁడు
కినుక పోలేపల్లి । క్రేవ నాణమరాజు
నవలీలతో గర్వ । మణఁచినాఁడు

---

1. The places marked with ... indicate the omission of lines which attribute to Linga all the achievements of his ancestors. These lines are given below in the order in which they are found in the Mss.

ఇమ్మహి కుంట్లూరి యిమ్మడి ఖండించి గొల్లపల్లెను రణము గుడిపినాఁడు

... ... ...

శాకతిరుద్రుండు గణుతింప కంచిలో పంచపాండ్యుల భంగపఱచినాఁడు

... ... ...

మేటినాగార్జునకొండ మీటుగఁ గొని గోలిమల్లారెడ్డిఁ గొట్టినాఁడు
ధట్టించి కదసిన తంగేటిరాజేంద్రుఁ దుమురుకోటొద్దను దునిమినాఁడు
మచ్చకొమ్మని గన్నమయయాబశేంద్రుని జిలుగుపల్లొద్దను జెండినాఁడు

... ... ...

కొలచల్మకాడను బలియుఁడై తురకలఁ గొట్టి యశ్వములను బట్టినాఁడు
కదిసి వేములకొండకడను తేరలరాజు సంబెటఁ గొని వెన్నుఁ జఱచినాఁడు

# వెలుగోటివారి వంశావళి.

మానుగ పెదవడ్డెమానొద్ద విడిగొని
యుఱికి జాజువఖాను నఱికినాఁడు
ఆవంచఁ గొనియు గంగావరం బేపున[1]
వంచించ కటు విభాళించినాఁడు

... ... ...

మదముచే నెదిరిన మామిడేలొద్దను
నల్లుబొప్పని గర్వ మణఁచినాఁడు

... ... ...

సప్తమాడియములు సాధించి వెసఁ దోడ
చెర్ల భీమారెడ్డిఁ జెండినాఁడు
నెట్టనఁ జాకల పట్టణం బొగి గొని
పట్టి యరాబళనేసిఁ గొట్టినాఁడు.

... ... ...

రాజిల్లు సంగమ రాయల నాగుల
పాటొద్ద వెస భంగ పఱచినాఁడు

... ... ...

కాపభూపాలుని ఘనబాహుబలమెల్ల నలభీమవరమొద్ద నణఁచినాఁడు
మగఁటిమి మెఱసి ముమ్మడిప్రోలభూవరు నెలుకవరంబొద్ద జరపినాఁడు
దన్నాలకోటొద్ద నన్నవోతారెడ్డిఁ గొంకక లజ్జ పోఁగొట్టినాఁడు

... ... ...

చెలఁగి నూటొక్క రాజుల జల్లిపల్లొద్దఁ ద్రుంచి రణంబు గుడ్పించినాఁడు

... ... ...

మహియెల్ల నెఱుఁగఁ గోమటిమాచభూవరుఁ దమ్మపడ్గంబునఁ దాపినాఁడు

... ... ...

మహనీయజయశాలి మచ్చరుద్రమనేని మగతులయొద్దను మార్చినాఁడు

... ... ...

సంగరంబునఁగొట్టి సత్తికదేవుని భూత తతికిఁ బొందు పఱచినాఁడు
ధీమంతుఁడైనట్టి తిరుకాళరాయనిపట్టి పట్టం బిల గట్టినాఁడు
దేవరకొండొద్ద తేజోవిభాళుఁడై యెఱ్ఱకృష్ణుని తల నేరినాఁడు
ఘనభుజాబలశక్తిఁ గాకితిరాజ్యంబు తిరుగరాఁ బునరుక్తిఁ దెలిపినాఁడు

1. A. B. గంగాపురియేపున

... ... ...

భువిలోన ననవేమ । భూపాలుఁ జెఱనెట్టి
యతనిని వేడ్కతో । నంపినాఁడు

... ... ...

చలమర్తిగండఁడై । సంబెట పిన్ననిఁ
బ్రాఘుఁ డెఱుఁగను । బఱపినాఁడు

... ... ...

నూతనగిరి నుగ్గు । నూచంబుగా నెక్కి
యన్నగన్నని గర్వ । మణఁచినాఁడు
ధరణీవరాహుఁడై । తల్లడిల్లఁగఁ బొంచి
చెంచువలయ మెల్లఁ । జెండినాఁడు
సింహఘాతకుఁ బార । సించి సంగర కేళి
మస్తఖానుని గెల్చి । మసలినాఁడు
నాణెంబుగా నబ్బి । నాటి రాజ్యంబెల్ల
నద్భుతంబుగఁ జూఱ । లాడినాఁడు
కృష్ణవెణ్ణా[1] జల । క్రీడావినోదుఁడై
యఖిలదానముల సొం । పడరినాఁడు[2]
జగనొబ్బగండఁడై । చలఁగి[3] రేచర్లను
దురకదళ[illegible]తలల్ । ద్రుంచినాఁడు
చటులోగ్రగతి రాయ । శరభమై[4] యవలీలఁ
దిరుగ సింహాద్రి సా । ధించినాఁడు
పరదళంబులు పటా । పంచలై పాఱంగ
నెన్న గొరవకొండ । నెక్కినాఁడు
కేళాదిరాయఁడై । కెరలి పోరట్లను[5]
చాదుఖానుని వెన్నుఁ । జఱచినాఁడు

1. A. కృష్ణవెణ్యా B. కృష్ణవేణ్యా
2. A. B. అఖిలదానవులసొంపడచినాఁడు ; R. V. C. p. 117 యఖిలదారుణుల సొంపడచినాఁడు.
3. The correct form is చెలఁగి
4. R.V.C. p. 117 శలభమై
5. ,, గోరంట్లను । చారఖానుని.

## వెలుగోటివారి వంశావళి.

నల్లగొండటుల విన్నాణంబుగా[1] నెక్కి
కపటాహితుల నేలఁ గలిపినాఁడు
గంగ సాక్షిగ మీఁటి[2] కదిసి రాజమహేంద్ర
వరము చూఱలుగొని వచ్చినాఁడు
సురథానుకొలువులోఁ బారసెడు[3] బిరుదుకై
ముద్దుధక్కని వెన్ను మొత్తినాఁడు
తేజంబుగాఁ బ్రౌఢదేవరాయలచేత[4]
నరుదుగా బిరుదందె నందినాఁడు[5]
ఇనతనూజుని భంగి నినుగుర్తికోటలో
లీల శత్రుల విభాళించినాఁడు
ధీరుఁడై యల్లావుదీ[6] సురథానుతో[7]
నెమ్మిగా భువనాద్రి నెక్కినాఁడు
గెంటించి బలిమి సిఖేంద్రఖానుని దోలి
యెలమి రాజ్యంబుఁ దా నేలినాఁడు
యెడవంక[8] బలవంక నేచి[9] తాఁకినయట్టి[10]
బలిదఖానుని భంగపఱచినాఁడు
రణకేళి నెఱుకవరప్రాంతమునఁ గొట్టి
మన్నెజంగిలి[11] నేపుమాపినాఁడు

---

1. R.V.C. నల్లకొండలను సన్నాహంబుగా నెక్కి ;
A. B. నల్లగొండటులు సన్నాణంబు నెక్కి
2. ,, p 117 ; A.B. మెరసి
3. ,, ,, ; ,, వారశెడు
4. ,, దేవప్రౌఢరాయలచేత
5. ,, బిరుదందె లందినాఁడు
6. A. అల్లాడధీ ; B. ఆవాడధీ
7. A. B. చే
8. ,, యలవంక
9. R.V.C. p 118 బలువంకలార్చి
10. ,, బట్టి
11. ,, జంగుల

# వెలుగోటివారి వంశావళి.

మణుగూరికోటలో మండువమల్నేఁడు[1]
ప్రతిఘటించిన నిల్చి ప్రామినాఁడు[2]
శరణుఁ జొచ్చిన నొచ్చి[3] సరిమఖానునిఁ బట్టి[4]
గౌతమీతటమునఁ గాఁచినాఁడు
పోరిలోనను గన్న భూపాలుఁ జెఱవెట్టి
ధృతిఁ గొత్తకొండ సాధించినాఁడు
మెదిరి విక్రమరాజు[5] కదనోర్వి గర్వింప
నణఁచి యింద్రునివీటికంపినాఁడు
సింహావిక్రమపురి సింగమపతె గొని[6]
గోపాలకృష్ణుని గొట్టినాఁడు
మెండుగ వీఁకమైఁ గొండపల్లన్నిలు
పూని వచ్చిన నూన పుచ్చినాఁడు
ఎదిరించ నేలూర[7] నెల్లూరితిప్పని
మదలించి[8] పటుగతి మోఁదినాఁడు
కుంట్లూరికోటపై గుంద్రౌతురాజులు[9]
మొత్తమై మెదిరిన మొత్తినాఁడు
బాణాలకోటపైఁ బ్రకటించి యుగ్రతఁ
గాలాగ్నిరుద్రుఁడై కాల్చినాఁడు
తోరగంటిబాదావి[10] తురకలఁ బరిమార్చి
పట్టణంబుల వెంటఁ[11] బరఁగినాఁడు

---

1. R.V.C. p 118 మన్నీడు
2. R.V.C. 118 తూలబరచినాఁడు : A. B. తరిమినాఁడు
3. ,, మెచ్చి
4. A. సరిమఖానునిగొట్టి B. సరణిభానునిగొట్టి ; R.V.C. p 118 సరిమఖానునిబట్టి
5. R.V.C. p 118 అదిరి విధమరాజు
6. V. R. (Ac. iii. p 104.) సింగమపతెకాని
7. A. B. వేలూర
8. R.V.C. p 118 మొదలింటు
9. A. B. రాజుల
10. R.V.C. p 118 దాబాజీ
11. ,, వెంటఁ బ్రబలినాఁడు

సంగరస్థలమున § సింగళదేవుని
 శిరము ద్రుంచటు[1] కీర్తిఁ § బరఁగినాఁడు

మలకపోలార్జును § మదమెల్లఁ గ్రక్కించి
 యన్నయాదవకొండఁ § గొన్నవాఁడు

గర్వించి తలపడ్డ § గండరగండని
 మెట్టఁ గదిసి తల § మెట్టినాఁడు[2]

కుటిలశాత్రవకోటిఁ § గోవిలకొండఁ దా
 మగతనంబున[3] బిల్కు § మార్చినాఁడు

ఉచ్ఛ్రిళ్లకోటకై § యుద్రేకమునఁ బోయి
 చెలఁగటు[4] నీరుగాఁ § జేసినాఁడు

ఉర్విలోఁ బొగడొందు § నుపనూరి సింహంబుఁ[5]
 జెనకిన రిపుకోటిఁ § జెండినాఁడు

శాంతభిక్షావృత్తి § జగమెల్ల నెఱుఁగ శ్రీ
 శైలపట్టంబునఁ § జాటినాఁడు[6]

బుక్కరాజునుఁ బట్టి § పొడిచేటికోటలో
 గజపతి మెచ్చఁగాఁ § గాఁచినాఁడు

దొరయు[7] సల్కయవారిఁ § దోలి తొప్పరలాడి
 బొగవాడొద్దను § బఱపినాఁడు[8]

---

1. R.V.C. p 118 ద్రుంచెటు

2. A. B. మెట్టగదిసెన శిరములం మెట్టినాఁడు. R.V.C. p 118 మెట్టగదియ తలఁగొట్టి నాఁడు.

3. B. తామసతనంబున

4. R.V.C. చెంగటి

5. ,, బొగడొందు । నుప్పూరి చెంగట

6. ,, (p. 119) has the following correction.

 ' శాతశిక్షావృత్తి జగమెల్లనెఱుఁగ శ్రీశైలపట్టణము దానేలినాఁడు

 A. B. శ్రీ । శైలపట్టంబు గానిల్పినాడు

7. A. B. కూగి

8. ,, బాపినాఁడు

చాటిచెన్నయగారిఁ జదిపి చట్టలు చీరి
కొండమల్లయగారిఁ గొట్టినాఁడు
గోరంట్లతిప్పనిఁ గొట్టి కోటెక్కియు[1]
వేఁగరికులమల్ల వెదకినాఁడు
చిటివల్లభయ్యను జెట్లను బడఁదోలి
పాణెమురాజును బఱపినాఁడు
రంగయభీముని రాజసంబునఁ దోలి
సాళ్వతిప్పని నేలఁ జదిపినాఁడు
పాండూరియడవిని బరఁగు మన్నీలను
దూల్చి[2] గొందులు చొరఁ దోలినాఁడు
ముచ్చికంపయ కుత్కికము నుపుగాఁ బడ మోఁది
పూలగంగు దళముఁ[3] బొడిచినాఁడు
రాజు లెప్పుడు మెచ్చ రామరాజ్యంబుగా
నెసఁగి[4] రాజాచలం బేలినాఁడు
దండిమై ముప్పది రెండు దుర్గంబుల
నేకధాటీగతి నెక్కినాఁడు
వీరభద్రుని దొడ్డ విభు వేమనృపతుల
రట్టడై కాలందేఁ బెట్టినాఁడు
ఘనమూరురాయర గండపెండారంబుఁ
బెనుపొంద డాకాలఁ బెట్టినాఁడు

గీ. రాజమాత్రుండె ఖడ్గనారాయణుండు
చారుతరమూర్తి రాజులచక్రవర్తి
గాయగోవాళుఁ డువ్వెత్తు[5] గండఁ డనఁగ
లీల నొప్పారు మాదయలింగవిభుఁడు. 126

---

1. A. B. కోటయునెక్కి
2. ,, తోలి
3. R.V.C. p 119 పూలసంగనిఖొంజు
4. A. B. యాసంగ; R.V.C. p. 119. ఎలఁగి
5. R.V.C. p 119; A. గోపాళుడుర వెత్తు; B. గండగోపాలుడుర వెత్తు

ఉ. ఆర్గురు చక్రవర్తులు పదార్గురురాజులు దక్క నన్యరా
డ్వర్గము నీసమాన మన వచ్చునె బాహుపరాక్రమక్రియా
భర్గసమాన[1] సోమకుల భార్గవరాము కొమారలింగ స
న్మార్గపరంపరాభిమత మంగళమూర్తి విశాలకీర్తులన్. 127

సీ. హెమ్మాడదేవుని నేపారఁ జూటూరి
సూరుసిఁ బాళము ధారుణీశు
గోవర్ధనుని సోమ దేవభూవల్లభుఁ
దెగువచెంటువ రాయ దేవనృపతి
నప్పచిచెన్నరాజు నారాఘువాఖ్యుని
నేచి విఠ్ఠలదేవు రాచవారిఁ
దిరుమలేంద్రునినన్న దేవు శ్రీనాథుని
వీరాదిగాఁ గల విభులఁ దొల్లి

గీ. చంపి జయముఁ గొనియెఁ[2] జాళిక్యభూపాల
విదళనుండు[3] సింగ విభునిమాదు
సమరమందు గెలువ సంబెటపిన్నని
విభవసంగ మాద విభునిలింగ. 128

క. అంభోనిధివలయములోఁ
గుంభినిఁ గల రాజులెల్లఁ గూలిరి నీచే
రంభాతిలోత్తమాదుల[4]
సంభోగముకొఱకు మాద జనపతిలింగా. 129

క. సురథాను గెల్చినాఁడవు
నరవరు ధట్టించి పంచినాఁడవు మున్నే
కరిరాజుఁ దోలినాఁడవు
సరియెవ్వరు నీకు మాద జనపతిలింగా. 130

వ. ఆలింగము[5] నేఁడె యశ్వపతి గజపతుల గెల్చి మూరురాయరగండబిరుదు

---

1. A. B. భలర్గ
2. ,, చేకొనియె
3. ,, విదళితుండు
4. ,, రంభాదిమేనకాదులు
5. ,, సింగము

వహించెను. ఆలింగమనేనికిఁ బర్వతనాయఁడును[1] నతనికిఁ గుమారలింగమ
నేఁడును[2] గలిగిరి. 131

వ. సంతతికి ననపోతక్ష్మాపాలుండు మొదలు. 132

క. అందు ననపోతవిభునకుఁ
బొందుగఁ బెదసింగవర్య భూమీశుండున్[3]
గందర్పరూపరేఖా
వందితుఁ డగు ధర్మవిభుఁడు వరుస జనించెన్.[4] 133

వ. అం దగ్రజుండు. 134

ఉ. సోమకులంబు రాజులను శూరత మించిన రెడ్డిరాజులన్
సామజనాథు కొల్వనను సారెకుఁ గొండెము పల్కు రాజులన్
వేములు రాపుసింగధరణీశ్వరుఁ డందియఁ బెట్టి యుండఁగా[5]
భామలు వ్రేళ్లఁ జూపుదురు పాదము లొత్తుచు వారివారికిన్. 135

వ. అతని యనుజుండు. 136

చ. కదనము బొమ్మరిల్లు చెలికత్తెల వీరజయాంగనామణుల్
మదకరి మస్తకుంభములు మాటికి దొంతులు సంగరస్థలిన్
గుదికొని వడ్డ[6] రాహుతుల క్రొవ్వులు గుజ్జనకూళ్లు చాపురే
పొదలెడు రాయరావు ననపోతయధర్మని ఖడ్గపుత్రికిన్. 137

వ. మఱియుఁ[7] బెదసింగమనేని పరాక్రమం బెట్టిదనిన. 138

సీ. నూనూఁగుమీసాల నులిచి హుంకారించి[8]
కపటించు బహురాచరికములగొంగ[9]

1. A. B. న్న
2. „ లింగమనేడుగల్గిరి
3. „ భూవరముఖ్యుండు
4. A. జనించిరి
5. A. B. యున్నగా
6. B. పండ్డ;
7. A. B. మరిన్ని
8. „ హుంకారించు
9. A. చాపు; B. మాపు

యొరసి యొరయ లేక ౹ యొరయుచు[1] వాహ్యాళి[2]
మెండొడ్డు రాజుల ౹ మిండగీడ[3]
తారసించిన చోటఁ ౹ దారసించఁగ లేక
అంపిల్లు రాజుల ౹ అంకుబోజుఁగ
యొగిలేని బిరుదుల ౹ వాగడింపుకొని చాల
నిక్కెడు రాజుల[4] ౹ ముక్కుఁగోయు

గీ. యొరయ నీతోడ బిరుదుకై ౹ యొరయ[5] వెఱచి
గజపతికిఁ గొండెముల్ చెప్పి ౹ కటకటించు
జూటుకూటువ[6] రాజుల ౹ చుక్కవాల
రాజహృద్భంగ త్రిభువనీ ౹ రావుసింగ. 139

సీ. కులము చాలని రాచ ౹ కూటిడ(?)గడ్డెలు
(?)బోటి కోతుల రాచ ౹ బోగుబంతులు[7]
పట్టఁగ బతిమాలు ౹ నట్టి రాచకుమాళ్లు
పూరిపిట్టలు రాచ ౹ బుడిదవిళ్లు[8]
సిగ్గెఱుంగని రాచ ౹ చివురులు గునిసెలు
గూబచంకల రాచ ౹ కొంకుగాండ్రు[9]
దడ మెఱుంగని రాచ ౹ తాటవేటనిగాండ్లు
ద్రోహబుద్ధులు రాచ ౹ దుడుకుగాండ్లు[10]

1. A. B. వొరశియఁగ లేక వొరయుచు
2. B. దాహ్యాళి
3. A. B. మిండ గీడు
4. ,, మెరసి నిక్కెడు రాజుల
5. ,, వరసి నీతోడ బిరుదుకై వరయ వెరచి
6. ,, వ(స)నకూటు
7. ,, బోటికాంతల రాచబోగిబల్లు
8. ,, పట్టువడి...బురికిపిట్టలు రాచబుడిద వెళ్లు
9. ,, సిగ్గెరంగని రాచ చివు(కు)రులు గునిశెలు గూబజంకల రాచ కొంకగాళ్లు
10. ,, దాళి మెరుగనిరాచ తాటవెట్టుగాండ్లు ద్రోహబుద్ధులు రాచదుటుకుగాండ్లు

లోకమున రాజు లౌలాక । లోకగాండ్లు(?)[1]
యొరయఁ జూతురు । బిరుదుకై యోర్వలేక
లాలితంబగు సింహతలాటమునకు
రాజహృద్భంగ త్రిభువనీరావుసింగ. 140

ఉ. పాలితకీర్తి సోమకుల । భార్గవరాముఁడు రావుసింగభూ
పాలుఁడు సోమవంశ నరపాలురఁ గొట్టి వధింప సోముఁ డా
శైలము లెక్కి క్రమ్మఱియు[2] శంకరు జూటముఁ జొచ్చి వచ్చి పా
తాళముఁ దూఱి యబ్ధిఁ బడి । ధాటికి నోర్వక పోయె మింటికిన్.[3] 141

క. సోమకులపరశురాముఁడు
భూమీశుఁడు రావుసింగపుడమీశుఁడు దా
సోమకుల మెల్లఁ జంపఁగ
సోముఁడు భయమంది శివునిజూటముఁ జొచ్చెన్. 142

శా. ఏమీ శేషుఁడ, యేమి నారద, ముదం । బేపారునా? తొంటి వి
క్రామం బేమియు లేద దేమి? మహి మీఱన్[4] రావుసింగాంకుఁ డు
ద్దామప్రౌఢిమఁ దోల[5] సోమకుల గోత్రాధీశ్వరుల్ జోగులై
భామల్ దామును బాముల న్వదకఁగాఁ । బాతాళముల్ దూఱితిన్. 143

ఉ. భైరవుకుక్క[6] బంగుగుల[7] । బాఁతి కుమాళ్లను గన్నతల్లి నీ
పేరు ప్రసిద్ధిగాఁగ మును పెద్దలచే విని చూడవచ్చితేఁ[8]
గోరెదు బోనముల్ గుడుముఁ । గూరయుఁ[9] బెట్టు మటంచు జోగికై
వారము లాడుచుఁ దఱచు వత్తురు రావునృసింహ నీరిపుల్. 144

---

1. A. లోకమునరాజు లౌలాక లోకసగాండ్లు
   B. ,, లోకగాండ్లు
2. A. B. క్రమ్మరియు
3. V.V.C. (p 61) has an additional line
   కం। చాలములోన నీదురిపు లాడుదు రెంతయు సింగభూపతీ.
4. V. P. Sastri, Cmm i p 57 ; A. B. లేదు యదెమీ త్రిభువనిరావు శింగాంకుడు.
5. ,, జయింప
6. A. B. భైరవకుక్క
7. ,, బండుగుల
8. ,, వస్తినే
9. ,, కూరయ

క. పుడమిని నాకాశంబునఁ
బిడుగు కరణి రావుసింగ[1] ♦ పృథ్వీశుఁడు దాఁ
బోడుపోడు మని వెను దగిలిన
వెడ వెడ జగనొబ్బగండ ♦ వేముఁడు పాఱెన్. 145

వ. ఆపెదసింగమనేనికిఁ జినసింగమనేఁడును[2] నన్నమనేఁడును[3] గలిగిరి. ఆయన్న మనేఁడే య్యారుకచేను బయట గండికోటకు ముట్టడిగా దిగఁగఁ[4], బోలెపల్లి బుక్కరాజు రాత్రియుద్ధంబున నన్నమనేనిఁ జంపఁగ[5] నతనితమ్ముఁడు[6] సింగమనేఁడు దనమఱఁదిఁ జూపల్లికొండభూపాలుని నప్పనవెట్టిన[7] [నాతఁడు] కరవాలభైరవ, గండభేరుండ, సంగడిరక్షపాలక[8] దక్షిణదోర్దండమండితంబైన సేనఁ గలమేటిగాను నాబుక్కరాజు పొడచేటికోటఁ జొచ్చినఁ, గోట యెక్కి బుక్కరాజున కభయం బిచ్చి తెచ్చెను జూపల్లికొండసుజనఘనుఁడు.

క. ధాటిం బోడచే డెక్కితి
హాటకముగ బుక్కరాజు ♦ కభయ మొసఁగి తా[9]
మేటి విభీషణునకువలె
నూటిగ నీజయము నిండఁ ♦ జూపలికొండా. 147

వ. ఆపినసింగమనేని వంశావతారం బెట్టిదనిన. 148

సీ. వీరాగ్రగణ్యుండు ♦ వెన్నభూపాలుండు
ఖ్యాతి నేరాజు ముత్తాతతాత
నెటిపాండ్యగజసింహుఁ ♦ డెఱదాచభూపతి
ధాత్రి నేరాజు ముత్తాతతండ్రి
సంగరాభంగుండు ♦ సింగభూనాథుండు
తనరంగ నేరాజు ♦ తాతతాత

1. A. B. పిడుగుదనుదారావుశింగ
2. „ న్ను
3. „ అన్నమనేఁడు
4. „ దిగి తె
5. „ జంపితె
6. „ 'తమ్ముఁడు' అనుటతప్పు; 'అన్న' యనుట యొప్పు అని తోఁచుచున్నది
7. „ వప్పువెట్టిన
8. „ సంగడిరక్షపాలక
9. „ కభయంబిచ్చితి

ఆదిగర్భైశ్వర్యుం । డనపోతభూపతి
తర్కింప నేరాజు । తాతతండ్రి[1]
చిరకీర్తి యగురావు । సింగావనీశుండు
ఘటింప నేరాజు । తండ్రితండ్రి
బిరుదభీకరుఁడైన । పినసింగనరపతి
చెన్నొంద నేరాజుఁ । గన్నతండ్రి
శూరుఁ డారాజదైతేయ।శోషణుండు[2]
సారసస్వాంతసేవావి।శాలుఁడైన[3]
యన్నమాంబాతనూజాతుఁ । డనఘమూర్తి
రాయరావన్నపోతధ।రాధిపుండు[4]. 149

ఉ. మేదినిరాయరావనెడు[5] । మేటి మహాబిరుదప్రతాపసం
పాదన మన్నపోతజన।పాలుఁడు సేసినఁ జెల్లుఁగాక యీ
పాదలి మన్నెబందల[6] క।పాత్రపురాజుల కేల గల్గుఁ దా
నాదటఁ[7] దాండవంబు శివుఁ । డాడిన జోగుల కాడఁ జెల్లునే. 150

సీ. ఛప్పన్నరాజన్య।సంగరస్థలిలోన
వాఁడె రా జని కాన । వచ్చు నిన్ను
బిరుదనూపురరాజ।భీకరస్థలిలోన
వాఁడె రా జని కాన । వచ్చు నిన్నుఁ
బరభేదనాటోప।పట్టభద్రులలోన
వాఁడె రా జని కాన । వచ్చు నిన్ను
సర్వసర్వంసహా।చక్రవర్తులలోన
వాఁడె రా జని కాన । వచ్చు నిన్నుఁ

---

1. A. తండ్రి తండ్రి ; but the word తాత is transcribed over the line above the first తండ్రి by the scribe.
B. తాత తండ్రి
2. A. B. నవుదనాంశ్రి
3. " దిశాలుఁడైన
4. " ధరావిభుండు
5. " రావుయను
6. " పాదరి మంన్యబదలకు
7. " నే ఆదల

జండభుజదండఖండిత । సకలవైరి
మండలేశ్వరనుత । వైరిపుండరీక
పరిమళాపూర్ణ దిగ్దంతి । జలవిహార
యహితనిర్ఘాత రాయరా । వన్నపోత. 151

క. ఒకమెతుకున నొకనాఁకలి
ప్రకటితమ్ముగఁ దీర్పరాదు । పదివేపుర నీ
వొకమెతుకున రక్షింతువు
అకలంకా రాయరావు । అనపోతాంకా. 152

క. సమ్మెటసోముని సరెపలి[1]
తిమ్మని నలకొండవీటి । దిక్కున మెఱయన్
దమ్మెటము వేసి గెలిచితి
వమ్మక్కా రాయరావు । అనపోతాంకా. 153

సీ. పౌరుషంబున నీవు । పానగల్లాదిగాఁ
గోటరాజ్యంబెల్లఁ । గొల్లలాడి
యేపుమై రాజమ । హేంద్రంబు మేరగా
రెడ్డిరాజ్యంబెల్ల । రేఁగఁ గొట్టి
బాహుబల్మినిఁ జెన్న । పట్టణంబు మేరగాఁ
దిగుటురాజ్యంబెల్ల । దెబ్బఁ దీసి
మొక్కలంబునఁ[2] జొచ్చి । ముద్దోగి[3] గీటుగ
బోయరాజ్యంబెల్లఁ । బొడిచివైచి
నేర్పు నెఱపించి[4] రాయల । నిగ్రహించి[5]
యట్లు సంబెట్ల గెలిచితి । వాహవమున
విమలచారిత్ర సింగభూ । విభుసుపుత్ర
వర్ణితాటోప[6] రాయరా । వన్నపోత. 154

---

1. B. నరెపలి ;
2. R.V.C. p 123. A. B. మొక్కరంబున
3. ,, ముద్దోజి
4. ,, నెలపించి; A. B. నేర్పున రప్పించి
5. A. B. నిర్వహించి
6. B. ఘోర : R.V.C. p. 123

సీ. [1] [పటుసోమకులరాజపరశురామాంకుఁడై
సమ్మెటసోముని జక్కఁజేసె
ఖడ్గనారాయణగాయగోవాళుఁడై
సరిపల్లెరాజుల సంహరించెఁ
బట్టుతలాటాంకబల్లరగండఁడై
యనవేమరెడ్డిని నాజిఁ దునిమె
జగమంతు రాయవేశ్యాభుజంగాంకుఁడై
సురథానిబలముల సొరిది గెలిచె
ధరణి నాతఁడు భీమప్రతాపవిజయ
బాహుబలశాలి నిత్యసౌభాగ్యశీలి
లలితసుగుణుండు రేచర్లకులపవిత్రుఁ
డనఁగ వెలసెను సింగయ[2] యన్నవిభుఁడు.] 155

వ. ఆయనవోతమనేనికి సర్వజ్ఞసింగమనేఁడును[3] వసంతరాయఁడును బుట్టిరి.
అందగ్రజుండు. 156

సీ. సకలవిద్యాభ్యాససాహసగరిమంబు
సూటి మీఱఁగఁ దోఁడు సూపినాఁడు
కఠినశాత్రవయూథఘనకంఠరక్తంబు
వేడ్కఁ గాళికి భుక్తి వెట్టినాఁడు
సాధుమార్గక్రియాసౌజన్యమున నీతి
చెలఁగ సద్వర్తనల్ చేసినాఁడు[4]
సంతతార్థివ్రాతసముదయంబుల తోడ
వెలయ బాంధవము గావించినాఁడు
అతఁడు భూపాలమాత్రుఁడే చతురవిభవ
విజితజంభారి[5] సర్వజ్ఞవిగ్రహంబు

---

1. This verse is not found in the Velugotivāri vams'āvali, but is quoted both in V.V.C. and R.V.C.
2. V.V.C. p. 63; R.V.C. p. 12 పినసింగ
3. A. B. న్న
4. ,, తతహేతిచలగి వర్తనలుగా జేసినాడు
5. ,, వితతజంభారి

వాసికెక్కిన రేచర్ల వంశవార్ధి
శీతకరుఁడగు రేచర్ల సింగవిభుఁడు. 157

సీ. రాధేయుదానంబు ప్రాభవం బంటిమా
యూఁడునో యూడదో యూఁడరాదు[1]
సురభూజములవార్త సొబగు పొమ్మంటిమా[2]
యెండునో పండునో యెఱుఁగరాదు
జలదంబు[3] చాగంబు చర్చింత[4] మంటిమా
మెఱచునో పఱచునో[5] మెచ్చరాదు
కామధేనువుసిగి[6] గణుతింత మంటిమా[7]
కట్టునో పట్టునో[8] కానరాదు
తోలు చూపక యుడివోక తూలిపోక
కొమ్ము గ్రువ్వక[9] కయికొంటు కోర్కు లనుచుఁ
బ్రథనవిజయుండు ఖడ్గనారాయణుండు
ఇచ్చుఁ గవులకు సింగభూమీశ్వరుండు. 158

వ. శ్రీనాథుఁడు సర్వజ్ఞునిసముఖమునకుఁ[10] బోవుచు శారదాంబను ప్రార్థన చేసిన పద్యము. 159

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునను

---

1. A. వూంటలోదాటమోమూరాదు ; B. పూటలోదాటిలోవూరాదు
2. A. B. వోమ్మటిమా
3. ,, జలజంబు
4. ,, చర్చింతదంటిమా
5. ,, మెరచునో వరచునో
6. ,, కావదినువయోగి
7. ,, గణుతించదంటిమా
8. ,, పట్టునో
9. ,, తోలుచూపక వుడిబోకతూ(లి)డివోక(కొ)మెమ్ము లె(ంప్ప)వ్వక
10. ,, సముఖానకు

బాగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి[1]
గాడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుదు
ఇంతకాలంబువలెఁ గాదు పంతరీతి
నెట్లు మెప్పించెదో కదా యింకమీఁద
రావుసింగాంకభూపాలు ధీవిశాలు
సకలసద్గుణనికురంబ శారదాంబ. 160

సీ. ఏమిచ్చెరా యోరి యెమ్ము లిచ్చె దధీచి[2]
యెమ్ము లర్థులకుఁదా సొమ్ము లగునె
మహిమ చెప్పెద వోరి[3] మాంస మిచ్చెను శిబి
కండ లర్థులకు బంగార మగునె
జీమూతవాహనుం డేమిచ్చెరా యోరి
యడిగినఁ బ్రాణముల్ విడిచె నపుడు
కర్ణుని త్యాగంబు వర్ణించెదవు భట్ట
వర్మ మర్థికి పట్టువల్వ యగునె[4]
పూని యవి చెప్పఁ జూపఁగా రాని యావు[5]
లెన్నఁడో నాఁటి వార్తల కేమి చెప్పఁ
బ్రథనవిజయుండు ఖడ్గనారాయణుండె
యిచ్చుఁ గవులకు సింగభూమీశ్వరుండు. 161

వ. సర్వజ్ఞసింగమనేఁడు శ్రీనాథునకు సమస్య యిచ్చినపద్యము. 162

ఉ. తక్కక రావుసింగవసుధావరుఁ[6] డర్థుల కిచ్చుచున్నచో[7]
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రాఁకుఁ బెం

---

1. A. B. దుర్ఘటవివాహప్రహుడినవు(మ)ర
2. ,, తనయమ్ములిచ్చెదంచు
3. ,, చేళదవోరి
4. ,, వర్మమర్థులకు పట్టుశాల(ల్వ)లగునె; V. P. Sastri. Sr. Sr. App. p. 5. చర్మమర్థికి పట్టుసాలువగునె
5. ,, పూనియ(క)విచెప్పచూపరానియావు; V. P. Sastri, Sr. Sr. App. p. 5. పూనికలిఁ జెప్పఁజూపఁగా రానియావు
6. ,, ధరణీశ్వరుఁడు
7. ,, అర్థులకిచ్చునన్నచో; V. P. Sastri. Sr. Sr. p. 196 అర్థులకర్థమిచ్చుచో

పెక్కన కామధేనువు శిॽబీంద్రుల నెన్నదు భట్టదిట్టవై[1]
కుక్కవో నక్కవో ఫణివో ॽ క్రోఁతివో పిల్లివో బూతపిల్లివో. 163

ఉ. ఇమ్మహి రావుసింగమనుॽజేంద్రవసంతుని[2] యీవు లెన్నుచోఁ
గ్రమ్మ దధీచిభానుసుతॽకల్పకమేఘులఁ జెప్పనేల యా
బొమ్మ్మక వెట్టులాటలును ॽ బూని కళాసపు మొత్తులాటలుఁ
దుమ్ములచల్లులాటలును ॽ దూకొని సీఘుల చల్లులాటలున్. 164

వ. అతనియనుజుండు. 165

క, భట్టనఁగ రుద్రరూపము
భట్టనఁగా రాచవేల్పు ॽ పాటించనియా
తొట్టరిరాజుల కబ్బునె[3]
రట్టడి సత్కీర్తికాంత ॽ రావువసంతా. 166

చ. నడవడి చక్కగాద యొకॽనాఁడును[4] బుక్కిటఁ జేసమాన దే
ర్పడ వినఁ జెప్ప లేదు పెనుॽబందువునందును గాలిద్రాపు నీ
బడుగును నేల పొందదని ॽ పాసి వెసం[5] జనుదెంచి కాదె యీ
పుడమి వరించె వేడ్క నృపॽపుంగవు రావువసంతరాయనిన్. 167

వ. సంతతికి ధర్మ్మనేఁడు మొదలు. 168

చ. కదనమొ బొమ్మరిల్లు చెలిॽకత్తెలె వీరజయాంగనామణుల్
మదకరిమస్తకుంభములు ॽ మాటికి దొంతులు[6] సంగరస్థలిఁ
గుదికొని పడ్డ రాహుతుల[7] ॽ క్రొవ్వులు గుజ్జనగూళ్లు బాపురే
పొదలెడు[8] రాయరావు ననॽపోతయ ధర్మని ఖడ్గపుత్రికిన్. 169

1. A. B. నెన్నడు భట్టదిట్టడై
2. ,, వసంతములీవు లెన్నుచో
3. ,, కబునె
4. ,, నడవడిచక్కగాదు(వొ)నొకనాడును: cf V. P. Sastri, Sr. Sr. App. p. 5.
5. V.V.C. p 70 ఫణిఁ
6. A. దొత్తులు
7. B. రాహువుల
8. A. B. పొదలుచు

చ. పొలుపుగ రాయరావు ననǂవోతయధర్మకుమారచంద్ర నీ
చెలువపు వామపాదమునఁ ǂ జెల్వు వహించినయందె ప్రోఁత[1] దా
ఘులుఘులు ఘల్లుఘల్లు మనఁ ǂ గంపిలు రాజుల గుండె లన్నియుఁ
ఝులుఝులు ఝల్లుఝల్లు మని ǂ చల్లిక గుబ్బటిలంగ[2] నెప్పుడున్. 170

వ. అతని కుమారుండు. 171

సీ. సోమకులంబు రాǂజుల నీవు సాధింప
శంకఁ జంద్రుం డొǂక వంకవోయె[3]
హేమాద్రిదానచింǂతామణి వని ప్రోఁగఁ[4]
గనకాద్రి యొకవంకఁ ǂ గదలకుండె
గజదళసంహారǂవిజయంబు గైకొన్న
గజిబిజి మాని దిǂగ్గజము లొదిఁగె[5]
రూపనారాయణǂరూఢి నీ వెచ్చిన
హరి నరసింహత్వǂ మాచరించె
నీకు నేరాజు లీడు విǂవేకచరిత
కలితమూవరురాయర[6] ǂ గండబిరుద
భవ్యచారిత్ర ధర్మభూǂపాలపుత్ర
రాయరావైన మేదిని ǂ రావుతిమ్మ[7]. 172

సీ. నారసింహస్తంభǂసారంబు లోహంబు
బడబానలజ్వాల ǂ పాసుǂకొల్మి[8]
మందరశైలంబు ǂ మానైన దాఁకలి
బలురాహుదంష్ట్రలు ǂ పట్టుకార్లు

---

1. A. B. మోఁత
2. ,, గుబ్బగలంగ
3. ,, వంకనోర (వంక)వో యె
4. ,, మోఁగి
5. A. లొదవె ; B. మెదలె
6. A. B. గలిగినముగురురాయరగండబిరుద
7. A. రాయతిమ్మ : B. రాయరావుతిమ్మ
8. A. కొల్మి

ఒత్తిన[1] సప్తవాయువులు తిత్తులగాఁడు
భుజగాధినాథుండు బొగ్గుఁబ్రోవు
నిటలాక్షుఁడమరు వార్భట[2]మైన సంబెట
డంబైన కాలకూటంబు పదను
మిహిరబింబంబు నిద్దంపు[3] మెఱుఁగుసాన
వీరభద్రుండు నెఱవాదికారుకుండు[4]
సృష్టిమించిన నీఖడ్గసృష్టి నార
రాజసముకొమ్మ మేదినీరావుతిమ్మ. 173

ఉ. ఈతఁడు గూర్జరాధిపతి యీవలివారలు చోళపాండియుల్
ఆతల నంతె భూపతుల[5] టావల సోమకులేశు లంచు వి
ఖ్యాతుల[6] రావుధర్మనివరాత్మజు[7] తిమ్మనియందె రాజులన్
జేతులఁ జూపి చెప్పుదురు చేడెలు పాదము లొత్తు నత్తఱిన్. 174

వ. ఈతిమ్మానేనికి ధర్మానేఁడును[8] చిటిదాచనేఁడును[9] గలిగిరి. అందగ్రజుండు.

క. కారాకు డుల్లి తరువులు
మారాకులు పెట్టుఁగాక మాటికి మగుడన్[10]
మారాకు పెట్టఁ జెట్టా
ధారుణిపతి కేల రావు ధర్మనృపాలా. 176

వ. ధర్మానేనిసంతతి రావువారు. 177

---

1. A. వొత్తుఅన ; B. వొత్తున
2. ,, నిటలాక్షుడమరుగార్భటమైన
3. ,, యిద్దుర
4. ,, కారకుండు
5. V.V.C. p. 71. చోళపాండ్య భూ। నేతలు వారు వింధ్యధరణీపతు
లావల సోమవంశ వి।ఖ్యాతులు నంచు
6. A. సోమకులేశలయ్యి విఖ్యాతులు ; B. సోమకులేశు లయ్యివిఖ్యాతులు
7. V.V.C. p. 71. రావుధర్మనృపునాత్మజు
8. ,, న్ను
9. ,, న్ను
10. A. మగుడన్

సీ. కట్టునో వట్టునో కామధేనువు దాను[1]
చూఁడిదో పాఁడిదో చూడరాదు
కాచునో కావదో[2] కాక వేలుపుఁజెట్టు
ఎండునో పండునో యేటిఫలము
చిక్కునో తక్కునో చింతామణిశ్రేణి
త్రవ్వమో[3] రువ్వమో రాళ్లతోడ
మెఱచునో పఱచునో మేఘుఁ డొక్కొక్కచోటఁ
దేలునో వాలునో తెలియరాదు
అనుచుఁ దమలోనఁ దలపోసి రధివరులు
ఈగి నీతోడ నితరుల నెన్న లేక
రాజనిర్భంగ రణరంగ రాఘవేంద్ర,
రావుచిటిదాచభూపాల రసికలోల. 178

వ. తద్వంశోద్భవుండు. 179

ఉ. అక్కరో, తోడితెమ్ము సుగుణాకరు[4] దాచయయన్నవోతు ; నే
మ్రొక్కక కాని రాఁడెటులు మ్రొక్కరు రాజులు వానియందియర్
గ్రిక్కఱుచున్నవార లదె[5] కీడ్వడి మ్రొక్కిన యాలతాంగికిన్
అక్కట! మానహాని యగు నంతకుఁ జాలినఁ జాలు మ్రొక్కఁదన్. 180

వ. అనవోతానేనికి మాదానేఁడు పుట్టెను. 181

ఉ. దాచయయన్నవోతవసుధావరుమాదయనాయకేంద్ర, నీ
వేచిన[6] రాయరావు బిరు దెక్కువగా రిపులైనయట్టి యా
రాచకుమారవర్గముల రాసి యురంబుల డాగు లొత్తినన్[7]
జూచినవారు నిందరియుఁ జూడరు[8] నీబిరుదప్రసిద్ధికిన్. 182

---

1. A. B. ధేనువనదా
2. ,, కాయదో
8. ,, రవ్వమో
4. B. అక్కఁటతోడి తెమ్మనుగుణాకరు
5. A. B. వారయిదె
6. V.V.C. p 74 మాదనాయకుండు తా । నేచిన
7. ,, రాచధరాధినాధులయురంబుల డాగులనొత్తగానదల్
8. A. B. చూచినవారు నిం తునులి చూడరు: V.V.C. p. 74. చూచిప్పశింప రయ్యరుల సుందరులా

వ. ఆమాదానేనికి నెఱసూరానేఁడును[1] నలసూరానేఁడును[2] గలిగిరి. నలసూరా
నేనిసంతతివారు సూరానేనివారైరి.[3] ఎఱసూరానేనికి నేచమనేఁ
డును[4] మాదానేఁడును[5] గలిగిరి; మాదానేనిసంతతి పోలూరివారును,[6]
నేచమనేనిసంతతివారు వెలుగోటివారును [నైరి].[7] ఆ యేచమనేనివంశావ
తారం బెట్టి దనిన. 183

క. ఆ యెఱసూర్యపకును గరు
ణాయనుఁడు విరోధిభూపకరార్పితవివిధో
పాయనుఁడు పుట్టె నేచమ
నాయఁడు కవిసవిధ[8]కల్పకనగము ధరిత్రిన్. 184

ఉ. [9]శ్రీలలరంగఁ బాండ్యగజసింహుఁడు గానఁ జలంబు పెంపునన్
లాలితపట్టభూషణతలాటము సూరనరేంద్రుఁ[10] డేచఁడున్[11]
ఆలములోన నశ్వమున కాదటఁ బెట్టినఁ బెట్టుఁగాక యే
జాలియు మాలి యాబిరుదు[12] చయ్యన నన్యులు పెట్ట శక్యమే. 185

వ. అతనికుమారుండు. 186

ఉ. సంగరసవ్యసాచి[13] దృఢసత్యధురంధరుఁ డేచభూమి భృ
త్పుంగవుఁడందు[14] భూభువనభూషితభూరిగుణాంబురాశియై
సింగన సంభవించె నతిచిత్రము దాని నెఱింగి వైరిమా
తంగము లేఁగి కొల్చు సతతంబును మన్నెమెకంబు లన్నియున్. 187

---

1. 2. న్ను
3. వారున్ను
4. 5, 6, 7, A. B. న్ను
8. A. B. కవినవిధ
9. This short prose passage అతనికుమారుండు seems to have been wrongly inserted here by the scribe.
10. A. B. సూరనరే
11. V.V.C. p. 75 substitutes మాధవుం। డా
12. A. మాలియంబిరుదు; B. మాలియుం
13. „ సాగనసవ్యసాచి
14. „ భూ। పుంగవుఁడందు

వ. ఆపినసింగమనేనికుమారుండు నిర్వాణరాయపనేని పరాక్రమం బెట్టిదనిన.

మ. తలఁపెల్లన్ హరిభక్తియుక్తి దినకృత్యంబెల్ల ధర్మక్రియల్[1]
నిలువెల్లన్ దయరూప మెల్లయెడలన్ నిర్గర్వ మశ్రాంతమున్
గొలువెల్లన్ గవిగాయకావళి[2] పర[3]క్షోణీశ్వరుల్ సాటియే
వెలుగోటేచమశౌరి[4]సింగసకలోర్వీనాథరాయన్నకున్. 189

క. వెలుగోటి కోటపై గొడు
గలవడఁ బట్టించుకొన్న యుగ్గజపతి[5] దా
వెలుగోటిరాయవిభుఁ డన
నలఘుతరంబైన నామ మతనికి గలిగెన్. 190

గీ. పాదుకొన్న యనావృష్టి పరిహారముగఁ
బ్రతిన వానలు గురియింప బ్రాహ్మణులకు
నగ్రహారంబు లొనరించె నడిగినట్లు
ధీయుతుండైన వెలుగోటి రాయఘనుఁడు. 191

సీ. మాటాడితప్పెడు మన్నీఁడు మన్నీఁడె
పాటిమాలిన లజ్జ బడుగుగాక
నమ్మించి చెఱిచెడు[6] నరపతి నరపతే
గుఱిలేని[7] గుఱ్ఱాల గురువుగాక
రప్పించి చెఱిచెడు[8] రాజును రాజటె[9]
మానంబులేనట్టి మాలగాక
పలుకు సత్యములేని ప్రభువును బ్రభువటె[10]
ముక్కుచెవులులేని మొఱ్ఱిగాక

1. V.V.C. p. 80 దినకర్తవ్యంబులున్ ధర్మముల్
2. V.V.C. p. 80 and V. P. Sastri, (Cmm. i. p. 58) గాయకాళి
3. A. B. దర; V.V.C. p. 80 యితరుల్; V. P. Sastri. (Cmm. p. 58) యితర
4. V. P. Sastri. (Cmm. p. 58) వెలుగోట్యన్వయనారసింహ
5. A. B. యొగ్గజపతి
6. „ చెరిచేటి
7. B. గురులైన
8. A. B. చేరిచేటి
9. „ రాజురే
10. „ ప్రభువురే

వేరు నీసాటి మన్నీలు ఽ విశ్వమునను ?
శత్రునిశ్శంక, వెలుగోటి ఽ శాసనాంక,
భాగ్యచారిత్ర, సింగభూఽపాలపుత్ర
మనుజవిబుధేంద్ర, పెదరాయ ఽ మండలేంద్ర. 192

సీ. ఎలమితో మాటప ఽ ట్టిచ్చి నిల్పఁగలేని
యల్పుల విటుఁడు నీఽయడపవాఁడు
పరదళంబులఁ గని ఽ భయమంది పాఱెడు
కోఁచల బొజుఁగు నీఽగొడుగువాఁడు
కొలిచిన వారల ఽ కొలఁదెర్గి[1] నడవని
లండీలవిటుఁడు నీఽగిండివాఁడు
అర్థులనెల్లఁ గృ ఽ తార్థులఁ జేయని
కూళల బొజుఁగు నీఽకుంచెవాఁడు

వేరు నీసాటి మన్నీలు ఽ విశ్వమునను ?
శత్రునిశ్శంక, వెలుగోటి ఽ శాసనాంక,
భాగ్యచారిత్ర, సింగభూఽపాలపుత్ర,
మనుజవిబుధేంద్ర, పెదరాయ ఽ మండలేంద్ర. 193

సీ. మద మహీనాథుల[2] ఽ మెదడు బోనము సేసి
ప్రత్యర్థి దంతముల్ ఽ పప్పుసేసి
[3]యుగ్రాహితులగుండె ఽ లూరుఁగాయలు సేసి
శత్రుబాహువులు పచ్చళులు[4] సేసి
యరిరాజరక్తంబు ఽ లానవాలుగఁజేసి[5]
నిష్ఠురాజులక్రొవ్వు ఽ నేయిసేసి

---

1. B. కొలఁకెరి
2. ,, మదేభాదుల
3. This line is not found in B.
4. A. బాహులుపచ్చళ్లు
5. B. రానీహముగ

... ... ...[1]

... ... ...

మొనసినీఖడ్గ భేతాళ ముఖ్యులకును
విందు సేతురు సంగ్రామవీథులందు
[వేరు నీసాటి మన్నీలు విశ్వమునను ?]
శత్రునిశ్శంక, వెలుగోటి శాసనాంక,
భాగ్యచారిత్ర, సింగభూపాలపుత్ర,
మనుజవిబుధేంద్ర, పెదరాయ మండలేంద్ర. 194

సీ. శ్రీహరి నత్తఱిఁ జిత్తాబ్జమున నుంచి
మానంబుఁ జాఁపు[2]గా మేన నలఁది
తన సహాయంబుగా ధర్మంబు సమకట్టి
కోపంబు చూపుల కొనలఁ దాల్చి
బిరుదును దెగువయుఁ బెనఁగొన సంధించి
కరుణయుఁ దాల్మియుఁ గట్టి పెట్టి
ప్రతిపక్ష ధారుణీ పతుల గుండె లగల్చి[3]
లీలమైఁ గరవాలుఁ గేలఁబూని
యడుగు తడయకఁ[4] దడఁబడు నడుగు లిడక
తలఁపు చెదరనీయక లేకఁ[5] దలఁచు కొనక
తురగరేవంత చాతుర్య గరిమ మెఱసి
రణముఁ బొడఁగనె సింగయ రాయవిభుఁడు. 195

వ. ఎటు[6]వలెను. 196

---

1. A line is omitted.
2. A. B. బాడు
3. „ గుండెలుపగుల
4. „ తడ బడక తడబడ
5. „ చదరక లేక
6. A. యిటు

సీ. రాక్షసావళి డాయు రామచంద్రుని లేవఁ
గురుబలంబు నెదుర్చు[1] నరుని పగిది
భండనంబున నిల్చు భార్గవు భంగిని
హాలాహలము జుఱ్ఱు[2] హరుని మాడ్కి
నురగేంద్రు వెనుకొను గరుడుని చాడ్పున
, నసహాయుఁ డగు[3] విక్ర మార్కు పోల్కి
ధరను గేసరిఁ జూచు[4] శరభంబు రీతినిఁ
గరితండములఁ గన్న హరి విధమున[5]
రణజయోత్సాహలక్షణ రభస మెసఁగ
నిలిచె[6] మహానంది పడమట నిఖిల మెఱుఁగ
వంశపావన రేచర్ల వంశజుండు[7]
రాజతిలకుండు వెలుగోటి రాయఘనుఁడు. 197

వ. అప్పుడు. 198

క. పరిపంథికోటి విచ్చఁగఁ[8]
దఱుముచుఁ జెండాడి ఖడ్గధారావీథిఁ
దురమున సింగయరాయం
డరిమిలి[9] జయలక్ష్మికాంతనాకర్షించెన్. 199

వ. ఆసమయంబున. 200

---

1. A. జూచు రామచంద్రుని...బలంబుల కెదుర్చు
   B. జూచు రామచంద్రుని లేవ
2. A. ఆలాహాలము చెరుని చెరు
3. ,, అసహాయుడగు
4. ,, ధర కేసరిని
5. ,, హరియుభాతి
6. ,, నిలిచ ; B. నివిచ
7. A. B. వంశపావనుడు రేచర్ల వంశజుండు
8. ,, లిచ్చగ
9. ,, రాయడు అరిమెను

సీ. నారదుం డాహారి। నామకీర్తనసేయ
వ్యాసప్రహ్లాదులు[1] । డాసి రాఁగ
వరుస విష్వక్సేన । వాసుకుల్ పొగడంగ[2]
జయవిజయాదులు।సాగి[3] కొలువఁ
బన్నగాశనుఁడు వెం। పార[4]ముందఱఁ జన
నంజనాసూనుఁ డం। తంత నడవ[5]
నింద్రాదిదేవత । లెల్ల నుతింపంగ
గంధర్వకిన్నర । గాన మెసఁగ
సకలవైష్ణవ సన్నాహా।సమితి చేరి
పరిణమింపంగ వైకుంఠ । పదముఁ గాంచెఁ
ద్రిజగముల వెల్గు[6] సంగ్రామ । దీక్షగురుఁడు
రాయభూపుఁడు[7] రెండవ।రాఘవుండు. 201

వ. తదనంతరంబున. 202

సీ. ఘనతరమందార।కల్పకంబులనీడఁ
గడువేడ్క విశ్రాంతి । నడచి నడచి
ప్రాకారవిలసిత । ప్రౌఢరత్నద్వార
ములు సొచ్చి మదిలోనఁ । జెలఁగి చెలఁగి
సురుచిర[8]మణిమయ । సోపానములకాంతి
తఱచైన వీథుల । మెఱసి మెఱసి
వైకుంఠసౌభాగ్య।వైభవస్ఫురణలఁ
జూచుచుఁ బలుమాఱు । సొక్కి సొక్కి
వచ్చి వైకుంఠ నగరంబుఁ । జొచ్చి రాఁగ
దేవభామలు[9] స్వర్గము।త్రోవ నిల్చి

---

1. A. వ్యాసప్లంహ్లాదులు
2. ,, విష్వల్ త్సేనవానుడిగి ప్రముఖులు
3. A. B. జయవిజయాదులు చేరికొలువ
4. ,, పన్నగశయనుడింపార
5. A. అంజ్జనినూరుడు అందమొంద ; B. అంజనానూనుండు అందమొంద
6. A. B. వెలయు
7. ,, భూవరుడు
8. ,, కమనీయ
9. A. భామినులు B. భామునులు

భూనుతంబుగఁ దమలోనఁ బొగడి రెలమి
రమణ నిట్లని సింగయ రాయవిభుని. 203

ఉ. పాయక శంఖచక్రములు బాహులఁ జెన్నుగఁ దాల్చి యాదనా
రాయణుఁ డేవ మర్త్య[1] దివికి రాఁ గనుఁగొంటిమి రంభ, యెవ్వరే?
తోయజనేత్ర, యాజి భయదోషము నొందనివాఁడు ఖడ్గనా
రాయణుఁడైన సింగవిభు రాయప విష్ణునిఁ గొల్వ వచ్చెనే. 204

మ. అవుగా కే నిట నీదుపల్కు నిజమో? యీమాట తథ్యంబె కా
భువిలో నాజిని నిల్వువీరుల సదా భోగింపమా, క్రొత్తలే ;
యవునే యూర్వశి,[2] చూడఁ డన్యసతులన్ ఆవార్తము న్వింటి మే
ధవళాక్షీ, వెలుగోటి రాయప మహాధర్మిష్ఠి ధీయుండటే. 205

సీ. పరులు పెట్టిన వృత్తి పరనారివ్రతముగాఁ
జూచిన చూపుగాఁ[3] జూచినాఁడు
తాత పెట్టినవృత్తి ధరయెల్ల నెఱుఁగను
తల్లిభావంబుగాఁ దలఁచినాఁడు
తండ్రి పెట్టినవృత్తి తబ్బిబ్బుసేయక[4]
చెలియలిమాఱుగాఁ జేసినాఁడు
తాను బెట్టినవృత్తి తలఁపులో నెప్పుడు
నాఁడుబిడ్డలరీతి నరసినాఁడు
అతఁడిన్నిగుణంబుల[5] ననుసరించుఁ
జెలఁగి యెప్పుడు నాచార్య సేవఁజేయు
వసుధలోపల[6] సింగభూవరుసుతుండు
రాయనుతుఁడైన[7] వెలుగోటి రాయఘనుఁడు. 206

---

1. B. దేవము
2. ,, యూర్వశి
3. A. B. జూచినయాచూపు
4. ,, తండిచ్చుకాయక
5. ,, అతఁడు యిన్నిగుణంబుల
6. A. వసుధలోన వెలయు ; B. వసుధలో వెలయు
7. B. రాయనుతుడైన

కం. ధనమును బ్రాణము రెండును
దనరంగాఁ బాత్రములను[1] దాఁచిన వాఁడే
నిన్నున్నా సింగయరాయఁడు
చనఁగాఁ బొడఁగంటి మింతచాలదె మనకున్. 207

కం. అనవిని సింగయరాయఁడు
పనివిని వైకుంఠనగరిప్రాంతముఁ జేరెన్
ఘనసురమునియతి[2]నికరము
వినుతింపఁగ నర్థి కోటివేడ్కలఁ బొగడన్. 208

వ. అప్పుడు. 209

చ. రవిశతకోటితేజమున[3] రాజితమై తను వొప్పు[4] లక్ష్మితో
నవశముఁదాల్చి[5] కస్తుభమునవ్యపదస్థితి మించుదేవునిన్
సవినయభక్తిఁ గాంచి యటు సాగిలి దండము వెట్టి నిల్చినన్
దివిరిన వేడ్కమూలమగు దేవుఁడు రాయపఁ జూచి యిట్లనెన్. 210

ఉ. ఈతఁడు నారదా, వినుమ యెంతయు మత్ప్రియుఁడై[6] జగంబునన్
ఈతఁడు నాదుదాసులకు నెచ్చినసేవ ఘటించు నెప్పుడున్
ఈతఁడు మామకస్మరణ నేమఱఁ డెన్నఁడు[7] భావ వీథిలో
నీతఁడు మత్పురాణముల నెన్నుచు[8] మేలు ఘటించు నెప్పుడున్. 211

వ. అనుచు నానాయకరత్నంబు నాలోకించి. 212

సీ. వచ్చితే రేచర్లవంశపవిత్రుండ,
సత్యవచోల్లాస, నిత్యయశుఁడ,
రావయ్య[9] ఖడ్గనారాయణబిరుదాంక,
పరధనవర్జిత, పావనుండ,

---

1. A. B. చోట
2. ,, యెతి
3. ,, మును
4. ,, వప్పు
5. నవఘుముదాల్చు
6. ,, మత్రియుఁడై
7. ,, మాధవస్మరణ యేమరకెన్నడు
8. ,, నెన్నెటు
9. ,, రమ్మయా






కుశలంబెకా గాయగోవాళ నీకును,[1]
నోపరనారీసహోదరుండ,
పరిణామమే[2] నీకుం బద్మవంశపవిత్ర,
పరమశ్రీవైష్ణవపారిజాత,
యనుచు సంతోషచిత్తుండై యభినుతించి
యిష్ట మెయ్యేది వేఁడుమీ యిత్తు ననిన
ఫాలమునఁ గేలు కీలించి ప్రస్తుతించి
రసికతను[3] బల్కె సింగయరాయవిభుఁడు. 213

ఉ. సింగయరాయభూవిభుఁడు శ్రీహరిఁ జూచి నుతించి దేవ శ్రీ
రంగములోనఁ బూని ధనరాసులు విప్రుల కిచ్చి యాగముల్
సంగతిగా నొనర్చినను సద్గతి గల్గుట దుర్లభంబ యీ
సంగరభూమివంక మిము సందరిసింపను గల్గెఁ జాలదే. 214

క. ఇల బ్రహ్మచర్య మాదిగ[4]
వలసిన యాశ్రమము లెల్ల వ్రతనిష్ఠలతో
సలిపిన పుణ్యాలు నినుఁగనఁ[5]
గలుగుదురే నీదు[6] చరణకమలముఁ గంటిన్. 215

చ. అనిన సరోజలోచనుఁడు నాదర మొప్పఁ[7] గటాక్షవీక్షలన్[8]
గనుఁగొని రాయభూరమణ, కాంచితి నిన్ను[9] సదానురక్తి నీ
వనయము నాదు సన్నిధిని నర్జునభీష్మవిభీషణాది స
జ్జన[జన]పాల[10] భాగవత సంఘములోపల నుండు మెప్పుడున్. 216

---

1. A. B. నీకునో
2. ,, పరిణామతో
3. ,, (న)శితను బెలికె
4. ,, మొదలుగ
5. ,, పుణ్యమున హితము
6. ,, కల(రె)దెమిము గాన
7. ,, యాదరించి
8. ,, కటాక్ష(లో)మేచనుఁ
9. ,, మిమ్ము
10. ,, సజ్జనపాల

క. శ్రీవిభుఁడు నాదరించిన
నావిధమున భక్తితోడ నతిరమ్యముగన్
గైవల్య మేటి[1] కనుచును
సేవించెను నున్నవాఁడు సింగయసుతుఁడున్[2]. 217

క. శ్రీకాంతుని నిజదాసుని
ప్రాకటముగు[3] సింగవిభుని రాయనృపజయుఁడున్
శ్రీకరముగఁ గవిమల్లన
వైకుంఠారోహణంబు వరుస రచించెన్. 218

శా. ఆరాయక్షితిపాలమౌళికి విపక్షక్ష్మాధీంద్ర[4] దంభోళికిన్
శూరశ్రేష్ఠుఁడు సింగభూమివిభుఁడున్ సూకూరి[5] తిమ్మప్పయున్
సారోత్సాహి కుమారతిమ్మధరణీశక్రుండు[6] రంగప్పయున్
శ్రీరామేశచతుర్భుజంబు లన నర్థిం[7] బర్వి రత్యున్నతిన్. 219

[వ. సంతతికి రంగపనేఁడు మొదలు].[8] 220

గీ. అతని పుత్రుండు[9] రంగక్ష్మామాధిభర్త
చెలఁగి ఖడ్గంబు నిశ్రేణిఁ జేసినాఁడు
స్వర్గపురమున కరిగెడుశాత్రవులకు
మార్గమై కనిరాఘాటమార్గమునను. 221

ఉ. రంగపనేనియబ్బనృపరత్నము గోపనృపాలు ధాటికిన్
సంగరరంగభూములను శాత్రవకోటులు నిల్వలేక సా

---

1. A. B. మెచటి
2. ,, సింగయరాయఁడు
3. ,, ప్రాకటితగ
4. ,, వలిష్టాదీంద్ర
5. V. V. C. p 82.; A. B. సోకూరి
6. A. B. పాలుండు
7. ,, నర్థిం
8. In the place of this passage, సంతతికి కుమారతిమ్మానేఁడు మొదలు is found in the Mss; but the verses that follow describe the descendants of Rangapa.
9. A. B. యనుజుండు

రంగముఖిలలాములను । రాజ్యకపీంద్రతురంగసంపదల్
సంగతి నప్పనం బొసఁగి । శైలనుఁల౯ విహరింతు రెప్పుడున్. 222

వ. సంతతికిఁ గుమారతిమ్మానేఁడు మొదలు.[1] 223

చ. కుదురుగ మిమ్ముఁ గొల్చి[2] వెలుగోటిపురీంద్రకుమారతిమ్మ మేల్[3]
గదియఁగ[4] నగ్రహారములు । గైకొనఁ జూతురు భూసురో త్తముల్
బెదరక మిాకరాసి[5] హాతిఁ । బెట్టుటి[6] వైరులు పోయి యూర్వశి౯
గదిసి కుచాగ్రహారములఁ । గైకొనఁజూతు రదేమి చిత్రమో. 224

క. ఘనుఁ డాకుమారతిమ్మన
కు నయార్ణవరాశి పెద్దకొండవిభుం డ౯
గనితిమ్మభూకళత్రుఁడు
పినకొండవిభుండు గల్గి పెంపొంది రిలన్. 225

వ. అం దగ్రజుండు. 226

ఉ. శ్రీవిభవుండు రాయవిభుతిమ్మధరాతలనాథు పెద్దకొం
డావనిభ ర్త మన్నియసురాధిపుఁడౌ నటుగాక యున్న సం
భావితలోకపాలన మ । భంగురభోగవిభూతి వజ్రభూ
పావృత[7] బాహుదండ మరయ౯ నృపమాత్రుల కేల కల్గెడున్.[8] 227

క. ధరణిఁ బెదకొండభూవరు
వరతనయుఁడు తిరుపతీంద్రవర్యునకు౯ శ్రీ[9]
వరుఁడును నరుఁడును మరుఁడును
సరియగుదురు నీతిచాపసౌందర్యములన్. 228

---

1. A. B. తద్వంశోద్భవుండు కుమారతిమ్మ ప్రభుండు. But this would make Kumāra Timma a descendant of Gōpa of the preceding verse.
2. V. V. C. p 83, కుదురుగ నాశ్రయించి
3. V. P. Sastri, Cmm. i. p 57, కొమార తిమ్మనిన్
4. V. V. C. p 83, గదియుచు
5. B. కరాశి
6. A. B. బెట్టిన ; cf V. P. Sastri (Cmm. i. 57).
7. A. లోకపాలిత...భూపాయత; B. లోకపాలిత...భూపాయత
8. A. B. కల్గునే
9. ,, వరునయ్యతనుం

వ. [అగనితిమ్మానాయుని పరాక్రమం బెట్టి దనిన.][1] 229

సీ. చండరోషస్ఫూర్తి ఁ దొండమారయ గుళ్ల
కోట నిరాఘాటధాటిఁ గూల్చి
నచ్యుతదేవరాయలు రాయమన్నీల
బోజుఁ గితండని పోటుఁ[2] బొగడ నెగడె
గడిఁ దాఁటిరాకుండ వడిఁ దాఁకి మలకలా
ల్బలముల నేల కాల్బలముఁ జేసె
నెఱదిమ్మఁ గొనసారి నెరదిమ్మ బిగఁ[3]బట్టి
ఘటియించె గృధ్రకంకాలి[4] క్రోలఁ
దోలి తొప్పరలాడి చేఁబ్రోలి[5] తిమ్మ
నృపుని వధియించె నాబాలవృద్ధముగను
సోమకులముఖ్య భార్గవరామభీమ
బిరుదములు మించఁ గనితిమ్మనరవరుండు. 230

సీ. ఒకపారి కందవ్రోల్ కన్నప్పనాయునిఁ
జెండవె కుచ్చెల చేనిమేర
వీరయశాంతభూవిభునిఁ దోలాడవె
తలఁకి పాఱంగ[6] నుద్దండవృత్తి
నన్నూరియొద్ద నున్నతవిక్రమంబునఁ
జాయని గెల్చవె జగము లెఱుఁగ
శాంతభూధవలింగజనపాలుఁ గొట్టవె
రాణ మీఱఁగఁ గృష్ణరాయ లెఱుఁగఁ
జేఁబ్రోలి[7] తిమ్మయఁ జెండి చెండాడవె
చెలు వందఁగా మట్లచెఱువు నొద్ద

1. A. B. తద్వంశోద్భవుండు. But this would suggest that గనితిమ్మ was a discendant of Tirupatēndra of the preceding verse.

2. A. బోట B. బోటి

3. A. B. బిగు

4. ,, ఘుడ్పిచ్చ క్రోధకంకాలి

5. ,, చాబోలి

6. ,, తరుప (వ) యనగు నుద్దండవృత్తి

7. ,, చేబోలి

బయిరువఖానునిఁ బాఱంగఁ దోలవె
పరఁగంగ నిదె రొంపిచెరలయొద్ద
ఖానఖానుని హితఖానుని మొదలుగాఁ
గొట్టి సప్తాంగముల్ గొనవె జగతి
ఆంధ్రదేశాధీశులయిన మన్నెలఁ బోర[1]
రాల్పవె[2] మల్లాపురంబు బయట
నీవు జయశాలివైన నిన్నెదుర వెఱచి
సూరినాయనిసూరుఁడు సురుఁగు టరుదె
చారుమీనాంక రేచర్లశాసనాంక
రాయభూపాలుతిమ్మభూరమణుతిమ్మ. 231

సీ. గాయగోవాళుఁడు కదలి దండెత్తెనో
యెడమక న్నదరెనే యిందువదన,
ఖడ్గనారాయణఘనుఁడు కోపించెనో
తుమ్మి రొవ్వనివంకఁ[3] దోయజాక్షి,
దానచింతామణి తమకు వేయించెనో
గుండె జల్లనియెనే కోమలాంగి,
వీశెపట్టుతలాటవిభుఁడు దా వెడలెనో
దబ్బాటు వెట్టెనే తలిరుబోఁడి,
అంచుఁ దమకులసతులతో ననుదినంబుఁ
గాని శకునంబులం దెల్పి[4] కల్వరించి
దాఁగియుందురు కానల దర్ప మణఁగి
చిత్ర మిది గొమ్మ వెలుఁగోటిచిన్నతిమ్మ. 232

సీ. చెనసి యేదులఖాను సేనలఁ గొట్టవే
వెనుక ముందయి గముల్ విచ్చి పాఱ
నొరసి కందనవోలి హొన్నప్పనాయని
మర్దించవే విఱుపురమందు లిచ్చి

1. A. B. పోరి
2. A. గడుగవె; B. గడుసవె
3. A. B. రొవ్వనివక్క
4. ,, శకునబలందించి

మఱియు[1] భిక్షావృత్తి ముక్తిశాంతయలింగ
జననాథుఁ గొట్టవె జగ మెఱుంగ
నాలంబులోనఁ జేంద్రబోలితిమ్మయఁ జంపి
పంపవె దేవేంద్రపట్టణమున
కెన్నఁ[2] జిత్రంబు లిటువంటి వెన్ని లేవు
ప్రజ్ఞతో నీవు సేసిన పౌరుషములు
గాయగోవాళ బల్లరగండ బిరుద
రాయభూపాలుతిమ్మభూరమణుతిమ్మ. 233

సీ. ఎసరేఁగి[3] రిపుల భూ మేలనీయవుగాని[4]
యింద్రపట్టణము వారింపలేవు[5]
ఒదిఁగి రాజుల నీడ నుండనీయవుగాని
మందారముల[6]నీడ మాన్పలేవు
సింహాసనము వైరిఁ జేరనీయవుగాని
చింతామణుల గద్దెఁ[7] జెఱుపలేవు
అరుల నెచ్చెలులఁ గూడాడ[8]నీయవుగాని
యల రంభతోడిపొం దాఁప[9] లేవు
ఇడుములకు మాఱు సంపద లినుమడయ్యె
నీడ వలదన్న స్వర్గాని కేగవలసె[10]
గాయగోవాళ గండరగండబిరుద
రాయభూపాలుతిమ్మభూరమణుతిమ్మ. 234

1. A.B. మెరశి
2. ,, అన్న
3. ,, ఎనరేగి
4. ,, నీయడు. The next three lines end similarly.
5. ,, వేరింపలేదు
6. ,, మందానిలము
7. A. గంద ; B. గంట
8. A. అరులనిచ్చెరులగూడెడ ; B. అరులనిచ్చెలులగూడెడ
9. ,, అనువలేదు
10. A. యిదుగొవారికి మప్పుదొగియనుమదయ్యె ; యీాడ వలసైన స్వర్గానికేడవలను. B. యిదుగోవారికి పువ్వుదొగియను మదయ్యె

సీ. మెఱయు రాహుత్తుల మొనసు గందపుఁబూఁత
మత్తారిరాజచర్మంబు కాసె
సముదారిమూంసఖండములు పుష్పాలదండ[1]
విమతభూపతి జడ నీరగోల
ఘనరక్తభీకరాకార మావేశంబు[2]
బెడిదంపుదాఁటులు పెద్దసివము
నాహవాటోపనిర్హ్రాదంబు బొబ్బలు
మెఱుఁగైన చాయలు మిట్టగ్రుడ్లు[3]
కదనమున మన్నెపోతుల గావుపట్టి[4]
పోరఁ జరియించు నీఖడ్గపోతురాజు[5]
గాయగోవాళ బల్లరగండబిరుద
రాయభూపాలుతిమ్మభూరమణుతిమ్మ. 235

సీ. పొలుపొందు తలకాయపూజకుండలు[6] సూచి
ప్రథిత విద్వేషుల[7] ప్రభలు సూచి
కర మరిఖడ్గాళి కడిఁదిదేఁటులు[8] సూచి
వెఱపైన[9] రణరంగవేది సూచి
మేలిమి నెసఁగిన[10] మెదడు గంధము సూచి
శత్రురక్తంపుటక్షతలు[11] సూచి
భీకరజయఘోష పెండ్లికూఁతురుఁ జూచి
పెంపొందు మన్నారపీఁటఁ జూచి

---

1. V. V. C. p. 85; A. సముదారిమోమున ఖండములపూలదండ
B. సముదారిమామున ఖండములపూలదండ
2. A. B. కారమాకారంబు
3. ,, సంహారంబు...మిట్టగుండ్లు
4. B. గామబట్టి
5. V.V.C. p. 85; A.B. సహితురాజు
6. A. B. భూబిగుండలు
7. A. B. విద్వేషిత
8. A. ఖడ్గాద్యాదికత్తిమెత్తులు ; B. ఖడ్గాదికత్తిమేతలు
9. A. B. వెడువైన
10. ,, నొసగిన
11. ,, యతుల రక్తప్రదక్షతలు

పేరెములు వాఱు నీఖడ్గ పెండ్లికొడుకు
అహహా! శ్రీచర్లసింహాసనాధినాథ
గాయగోవాళ బల్లర గండబిరుద
రాయభూపాలుతిమ్మభూరమణుతిమ్మ. 236

సీ. పగతుల నెత్తురుపైనూనెఁ బట్టించి
ఘనత సత్కీర్తియను కాసెఁ గట్టి[1]
మొనసిన వైరుల మొగసాలఁ దానాడి[2]
యుదిరిన దిక్కులయురువుఁ జూచి[3]
యహితభూపతులపై నారంగములు[4] గొని
తివురు[5] భూపతులపై తిరుపుగట్టి[6]
కొసరు మన్నీలపైఁ గోలల[7] వెసనాటి
చెలఁగు[8] భూవరులపైఁ జంపలాడి
వారి సప్తాంగములు చాగ[9] వహులు గొనియె
నిట్టి నీఖడ్గపుత్రికి నీడు గలరె
గాయగోవాళ బల్లరగండబిరుద
రాయభూపాలుతిమ్మభూరమణుతిమ్మ. 237

సీ. కదనవారాశి రక్తమున స్నానము చేసి
వైరి[10] చర్మంబు దోవతిగఁ గట్టి
సమదారి[11] ప్రేవులు జన్నిదంబులు వేసి
తగవైరి మెదడు చందనము[12] దీర్చి

---

1. A. ఘనతసత్కీర్తియుగాగ ; B. సత్కీర్తియుగాగ.
2. A. B. మెనసిన వైరుల మొగచాలి గానాడి
3. ,, వురువుచూచి
4. B. భూపతులై సారంగములు
5. A. తివిరిభూపతులపై ; తిమ్మభూపతులపై
6. A. తివురు ; B. తివుర
7. A. B. కోమల
8. ,, చలగు
9. ,, త్యాగవహిలు
10. ,, విమత
11. ,, సమరవైరి
12. ,, మెదడుగోపి చందనము

యొరసిన రౌద్రంబు । హోమకుండము సేసి
తఱచైన సరములు । దర్భ చేసి
**విమతుల దంతముల్ । వె** ల్లక్షితలు[1] చేసి
క్రొవ్వును గఱగించి । ఘృతము చేసి[2]
సొబగుతో వేల్చు నీఖడ్గ । సోమయాజి
యహహా! రేచర్ల సింహాస । నాధినాథ
గాయగోవాళ బల్లర । గండబిరుద
రాయభూపాలుతిమ్మ । భూరమణుతిమ్మ. 238

సీ. నీవు పుట్టినవేళ [నీ*] శత్రువరులకు[3]
దిగు లెత్తి [మఱు] పుట్టు[4] । దినము వచ్చె
నీ వొకించుక[5] నగ । నేర్చినఁ బగవారి
బ్రదుకు లెల్లను నగుఁ । బాటు లాయెఁ
గ్రమముగ నీవు వి । ద్దెము సేయ నేర్చిన[6]
విద్దెల[7] నారైరి । విమతవరులు
ప్రభుశిఖామణి నీవు । పరువాఱ నేర్చినఁ
బరువు లెత్తిరి పరి । పంథు లెల్ల
హాయము నీ వెక్క నేర్చిన । నహితవరులు[8]
కొండ లెక్కిరి తమయిండ్ల । నుండ వెఱచి
రూఢి నీ వాదిగర్భేశ్వ । రుఁడవుగాన
రాయభూపాలుతిమ్మ । భూరమణుతిమ్మ. 239

---

1. A. B. వెల్మక్షితలు
2. ,, 'క్రొవ్వుగరగించటు ఘుతముచేసి.' 'క్రొవ్వ' 'ఘృతము' అనుచోట 'ఘృ'ను 'ఘు' గా కవి భ్రమచే గ్రహించి 'క్రొ' 'ఘృ' లకు యతి మైత్రిగల్గించెను. ఇట్టి ప్రయోగములు 'నవనాథ చరిత్రము', 'భాస్కరరామాయణము' మొదలగు గ్రంథములయందు గానవచ్చుచున్నవి.
3. B. శత్రువీరులు
4. A. B. పుట్టిన
5. ,, నీవువకించుక
6. ,, క్రమమీద నీవు విద్యముగాయ నేర్చిన
7. ,, విద్యల
8. ,, నీవు హాయమెక్క నేర్చిన యహితవరులు

మ. ఘనతన్ బర్వతకందరస్థలమునన్[1] గాల్చిల్చి[2] పైకొన్న చోఁ
గినుకన్ గన్నడరాయ ఘోటమృగపంక్తిన్ గూల్చె నుద్వృత్తిమైఁ
జెనకన్ మత్తమతంగజప్రభు నదల్చెన్ రాముఁడే నేపునన్[3]
గనితిమ్మక్షితిపాలసింహుఁ బొగడంగాఁ బోలదే[4] యేరికిన్. 240

సీ. కల్పవృక్షంబులు గణుతింపఁ బడెఁ జెట్లు[5]
వడిఁ గామధేనువు వట్టిపోవు[6]
తుది నప్పువడి గాలిఁ[7] దూలె నామేఘుండు
రమణఁ జింతామణి రాతిగుండు[8]
పాతాళగతుఁ డయ్యె బలిచక్రవర్తి దా
భాషింపఁ జాగ్రుఁడు పక్షపాతి
యర్కనందనుఁడు దానవరుఁడు దరిద్రుండు[9]
శిబిమేని మాంసంబు చెప్ప రోఁత
యిట్టి దాతలవితరణ మేల చెప్ప[10]
నిన్నుఁ గొనియాడఁ దగుఁ గాని నేర్పుతోడ
నర్థి దారిద్ర్యతిమిర దోషాపహరణ
దినకరాటోప[11] వెలుగోటి తిమ్మభూప. 241

ఉ. గోపతితుల్యభోగ వెలుగోటిపురీంద్రకుమారతిమ్మ [సి]
రూపము విక్రమాంకు[12] నిజరూపముగాక మనుష్యరూపమే
యూపలు కట్ల, కాసిపిధమైన మనుష్యుల కేల గల్గుఁ [గ్రే]
చూపుల రాజ్యలక్ష్మి యరిఁ జూచిన[13] చూపుల వీరలక్ష్మియున్. 242

---

1. A. కంధరస్థలనన్ ; B. కంధరస్థలిని
2. A. B. గాల్చిల్చి
3. „ చామరేయేపునన్
4. „ పాగండబోలఁగే
5. „ బడిశిట్లు
6. „ ఒగికామధేనువు వొర్యగురుపా
7. „ గాని
8. „ గుండె
9. „ ద్యార్స్న దారిద్రుడు
10. „ వితరణుడేమిచెప్ప
11. „ ధీరతాటోప
12. „ విక్రమార్కు
13. „ వీరలక్ష్మి నలిగిచూచిన

శా. శ్రీమత్కాంతిఁ గృహం బ్రతాపమున వాక్ | శ్రీ) ధీవిలాసంబునన్[1]
సామర్థ్యంబున భాగ్యసంపదలఁ జం | చద్బాహుగర్వంబునన్
సోమున్ రాము రవిన్ గవిన్ మురహరుం | సుత్రామునిన్ భీమునిన్
... ... ... ...[2] 243

క. ప్రొక్కని రాజులు నీచేఁ
జిక్కని మన్నీలు సేవ | సేయని దొరలున్
లెక్కించి చూత మేరీ
దిక్కులలో రాయవిభుని | తిమ్మయ తిమ్మా. 244

వ. అల గనితిమ్మభూభుజునకు వేదత్రయ శిఖిత్రయ రామత్రయంబు లనందగిన కుమారులు పెదతిరుమలవిభుండును నాయనేంద్రుండును తిమ్మక్ష్మామణియు[3] గల్గిరి[4]. అం దగ్రజుండు. 245

చ. వినుతక పెద్దతిమ్మపృథి | వీధవు చేతి[5] పయోధరంపు వి
ల్లడరు గుణస్వనంబులుఘో | షమై[6] జడిమై శరవృష్టు లీనినన్
జడిసి నభోధ్వగాము లయి | చయ్యన శాత్రవరాజహంసముల్
కడువడి నేగుదెంచె వని | కా[7] వనజాకరతీరభూమికిన్. 246

వ. ఆనల్లగండ్లనాయని[8] సహోదరుండు. 247

సీ. తగువారిలోఁ జౌకళదనము గాంచిన నారి
యింద్రుచేఁ దూలిన | హీనుసగంబు
పురహరాలోకనంబునఁ గ్రాఁగిన మరుండు
పగటికైనను[9] లేని | భానుసుతుండు

1. A. B. వాచ్కధీవిలాసంబునన్
2. A line is missing
3. ,, తిమ్మక్ష్మమణి
4. ,, గల్గెనందగ్రజుండు
5. ,, చేత
6. ,, A. తెల్లడరు...వరషమ్మై; B. వెల్లడరు...వరషమ్మై
7. ,, దేరవనికా
8. According to the prose passage above, the name ought to be Peda Tirumala. Nallagaṇḍla Nāyaḍu is probably an alias of the same chief.
9. A. 'పగలింటికైన'

నడుము వేదటికంబు ♦ వడసిన కరివైరి
పిచివాడైపాలు ♦ వేల్పు టేలు
చిట్టాడి మడుగుఁ జొచ్చిన నాగకేతుండు
పలలాశిచేఁ బట్టు ♦ వడిన వజ్రి
తనదు గాంభీర్యధైర్యసౌందర్యదాన
శౌర్యకీర్త్యభిమానని ♦ స్తంద్రభోగ
ములకుఁ దులయె నా[1] భూమిని ♦ బొగడ నెగడె
నాయనేంద్రుండు సౌఖ్యసంధాయకుండు.[2] 248

సీ. పటహాభేరీఢక్క ♦ ఢాంకృతి ధ్వనులచేఁ
బగతురగుండెలు ♦ పగులువాఱు
హయఖుర ఘట్టనోద్ధత రేణురాగంబు
గగనభాగం బెల్లఁ ♦ గప్పికొనును[3]
బలపరాక్రమవీర ♦ భటరాహుతులచేతఁ
దోరంపు టడవి తుత్తుమురు లగును[4]
కరిఘటాప్రకటసంఘటిత ఘీంకృతముచేఁ
గుంభికుంభీంద్రముల్ ♦ గొణఁగు పడును
నీవు రణరంగభూమిలో ♦ నిలిచినపుడు
గాయగోవాళ ఖడ్గనారాయణాంక
భాగ్యచారిత్ర, తిమ్మభూపాలపుత్ర
నయహరిశ్చంద్ర, వెలుగోటి ♦ నాయనేంద్ర. 249

సీ. నిచ్చకల్యాణంబుఁ ♦ బచ్చతోరణమును
గలిగెఁబో నిర్జర ♦ కామినులకు
సర్వకాలంబును[5] ♦ సరిలేనిసంక్రాంతి
భోగియు గలిగెఁబో ♦ భూతములకు

---

1. A. B. సౌర్యకీర్తియభిమాన నిస్తాంద్రభోగములకు దులయన
2. ,, సంధాయనుండు
3. ,, కొనగ
4. ,, తుత్తుమురుగాగ
5. ,, సార్వకాలంబును

లేములు[1] విడిచి చ।ల్దియు వేఁడియును నిండ్ల
సమకూడెఁ బో మృగ।జాతి కెల్ల
నవత లన్నియుమాని । భువిచారములచేత[2]
వింతయై యొప్పెఁ బో।విహగకులము

ఆహవంబున నాగార్జు । నాద్రిబైటఁ
గొసరి[3] జఘులక్ష్మి నిన్నుఁ జే । కూడినపుడు
సోమకులరాజవర్గని । ర్ధూమధామ
నాయకోపేంద్ర వెలుగోటి । నాయనేంద్ర. 250

సీ. పరశురాముఁడు రాజ । పటలంబు ననిలోనఁ
జదిపిన[4] నాఁటి మాం।సంబురుచులు
కినిసి రాముఁడు దశ।గ్రీవాదిదైత్యులఁ
దునియించు[5] నాఁటి నె।త్తురులరుచులు
కవ్వడి గాంగేయ । ఘనయోధముఖ్యులఁ
జంపిననాఁటి మ।జ్జం[6]పురుచులు
వాసవుఁ డుగ్రజం।భాసుర[7] ప్రముఖులఁ
దునిమిననాఁటిమే । దోరసంబు[8]

... ... ... ...

నాయకాధీశ వెలుగోటి । నాయనేంద్రుఁ
జేరి యనిలోనఁ జిరకాల[10] । జీవులైన
భూతములు సౌఖ్యదశదిశా । భూములందు. 251

1. B. వేములు
2. A. B. చవిచారముల
8. ,, మరియునాగార్జునాద్రిజైటకడగి
4. A. రాజ్యపటలంబు...బొరిగొన్న
5. A. B. సమయించు
6. ,, మజ్జంపు
7. ,, వాసవుడుగ్రాజి భాసుర
8. ,, మేదురరసంబు
9. A line is missing.
10. ,, చరితమాలోన స్థిరకాలజీవులై

సీ. పద్మనాయకు లైన । బాంధవు లొకవంక
నుత్తమక్షత్రియు । లొక్కవంక
దండనాథులు[1] మేటి । దళవాయు లొకవంక
నుభయప్రధానులు । నొక్కవంకఁ
గవులు విద్వాంసులు । గణితజ్ఞు లొకవంక
[నుర్విపతులదూత । లొక్కవంక][2]
భటనటగాయక । భామిను లొకవంక
నుచితజ్ఞులగువైద్య । లొక్కవంకఁ
బ్రభులుఁ బరివారములు మిమ్ము । బలసికొలువ[3]
మహిని శోభిల్లు నాస్థాన । మంటపంబు[4]
విమలచారిత్ర తిమ్మభూవిభుసుపుత్ర
సయహరిశ్చంద్ర వెలుగోటి । నాయనేంద్ర. 252

మ అరయన్ దిమ్మయనాయనేంద్రసుతుఁ డాభుజా । యుత్తాసిచేఁ గార్యభా
సురపారాభవభాద్రశుద్ధవితి । సోమాఖ్యవారాన డి[5]
గ్గరి నాగార్జుని కొండదొద్ద రిపులన్ । ఖండించె నాఖండలే
శ్వరనాగేశ్వరలింగభూవినుతకృష్ణావాహినిన్ సాక్షిగన్. 253

చ. అలవునఁ దాళజాఘులను । హైహయులన్ ప్రమదేంద్రుపుత్రునిన్[6]
దోలి సగరుండు భార్గవుఁడు । ద్రోణతనూజుఁడు ద్రుంచినట్లు వి
హ్వలముగ సోమవంశజుని । యావడి యోబళరాజు నాజిలో
నలిగి[7] వధించెఁ దాద్రిపగత్త భళి మావెలుగోటి నాయఁడున్. 254

క. ఆవడి యోబ[8]నృపాలుని
నావడి సేనాయనయ్య । యసిధారఁ బెగం

---

1. A. B. దండనాయక
2. The Mss. repeat here the second part of the previous line
3. This line is not found in B.
4. A. B. నీయాస్థాన మంటపమున
5. ,, కార్యభాసురుండైపరాభవ సంవత్సర భాద్రపదాదిశుద్ధచవితిన్ సోమవార మందాజిద ; 'సురపారాభవభాద్రశుద్ధచతుర్థీ । సోమాఖ్యవారంబునన్ । ధర' అనియు సవరించవచ్చును. ఇందు 'ర్థీ' తేల్చిపలుకవలయును
6. ,, పుత్రుఁడున్
7. ,, తోడరి
8. ,, బోటు

గా వడిని రంభ కైకొని
యావడి సేయంగ దివిజు । లక్కడ బెదరన్[1]. 255

క. సోమకులపరశురామో
ద్దామమహాబిరుదమునకుఁ । దాతలకంటెం
బ్రేమమున వన్నెఁ దెచ్చును[2]
నీమహి వెలుగోటినాయ । నేంద్రుఁడు దలఁపన్.[3] 256

వ. అతని యనుజుండు 257

సీ. ఆజీము ఖాను[4] వే।న్నాఁడి పోఁడిమి బిట్ట
దర మట్టితివి[5] పాండ్య । దళవిభాళ
కలనిలోన యఖూప । ఖానుఁ బోఁ దోలవె
పరువెత్తఁ బ్రతిగండ । భైరవాంక
కుదియించి యలచింత । గుంటధర్మారావు
నడఁచవె[6] రాయవే । శ్యాభుజంగ
బతి[7] మాలఁ జేసి భూ । పతిరావునాగనిఁ
గావవె[8] రణాలయ । కాలరుద్ర
చండించి దేవర । కొండ ఠాణీలను
మర్దించవే[9] చల । మర్తిగండ

1. A. దివిజులక్కడబెదరికి ; B. దివిజులక్కడజేరికి
2. B. దెచుఁ.
3. A. B. ధాత్రిఁ
4. ,, ఆజిముఖాన : V. V. C. p. 86. అజీజిజ్జాఖాను
5. A. పోడిమిపెట్టుదరమెట్టు ; B. పోడిమిపెంటువరమెట్టు
6. A. B. నడచెద
7. B. లతి
8. B. కాలవె
9. A. B. ధాణీలతలలు మొత్తించవే

మల్కిభరాము[1]భూ । మండలేశ్వరునిఁ జెం
డాడవె యవనకో । లాహలాంక
మునుపుగా ముస్తఫా[2] । ఖానుఁ బోఁ దోలవె[3]
దండితో దానచిం । తామణీశ
ధాటిచేఁ జిట్టల । కోట మట్టించవె
యెలమితో మన్నెభ । ద్రేభమూర్తి
ధరయెల్ల నెఱుఁగంగ । దస్తురఖానునిఁ
జెండవె గండర । గండబిరుద
పశుగణంబులఁ గొల్ల । పట్టించవే శౌర్య
వైఖరి గాయగో । వాళబిరుద
ముగురురాజులు మెచ్చ । మగఁటిమిఁ జూపవె
గడిదుర్గమునఁ బరా । క్రమమృగేంద్ర
నీప్రతాపంబు మహిని వర్ణింప వశమె
సర్వబిరుదులకొమర వే । శ్యాభుజంగ
భళిర ! వెలుగోటితిమ్మభూ । పతికుమార
మతిఫణీశ కుమారతి । మ్మక్షితీశ. 258

సీ. సిరులిచ్చి[4] కర్ణాట । సింహాసనాధ్యక్షుఁ
డాదరింపఁగ నెవ్వఁ । డలరెయిల్లె
విఱిగినయని నుండు । వెఱుఁగఁ డెవ్వఁడు కల
నైన నేమఱుపాటు । తోనవైనఁ[5]
దురకమూఁకలఁ బాఱఁ । దోలె నెవ్వఁడు మహో
గ్రాటోపమునఁ గొండ । వీటిముద్దఁ
దను భజించిన బంధు । తతి నెల్లఁ దనయంత
వారిఁగా నెవ్వఁడు । ధరణిఁ బెనిచె

---

1. B. మల్కిభూరాము
2. A. B. ముస్తాఫ
3. ,, పారిగదగవె
4. ,, సిరులిచ్చు
5. ,, తోడనైన

నతఁడు బల్లరగండ కేళాదిరాయ
గాయగోవాళ గండర గండ చండ
సర్వబిరుదుల కొమరవే శ్యాభుజంగ
బిరుదభరితుండు చినతిమ్మ నరవరుండు. 259

సీ. తననేత్రనీరజ ద్వయము సంపద లిచ్చు
నిగురుఁబోఁడికిఁ బుట్టి నిల్లు గాఁగఁ
దనయశఃకందుకం బానరు మాటమీఁటారి
యుబ్బుచన్గవకుఁ బెన్నుద్ది గాఁగఁ
దనముద్దుమోము కాంతాదృక్చకోరదం
పతులకు నెఱ చందమామ గాఁగఁ
దనప్రతాపాగ్ని కందర్పదర్పధ్వంసి
చూఱుఁ గంటికిని నీడు జోడు గాఁగఁ
వెలసె నెవ్వాఁడు మధుమదా వృతతురుష్క
వర్మరక్తరసచ్ఛటా వర్ధమాన
భంగసంఘాత[1] కృష్ణాత రంగిణీసుఁ
డధిపమాత్రుండె పిన్నతిమ్మావనివిభుఁడు. 260

సీ. శ్రీకరంబుగ నీవు చిట్టెలఁ గైకొన్న
దేవరకొండకు దివులు వుట్టె
భీకరంబుగ నీవు పేరూరుఁ గైకొన్న
నానల్లగొండ శౌర్యం బణంగె
దేవులపల్లీవు కవితోఁ గైకొన్న
నరవపల్లెకు జయం బల్లఁదొలఁగె[2]
నాగులపాడీవు[3] వేగమె కైకొన్నఁ
దూలుంద్రగొండ[4] గగ్గోలువడియె[5]

---

1. A. B. గాథసాఘాత
2. ,, జయంబెల్లదొలగె
3. ,, నాగులపాడునీవు
4. ,, తూలిపుండ్రగొండ
5. ,, పడును

వాడపలి నీవు గైకొని | వఱలువేళ
గడమదుర్గంబు లన్నియుఁ | గలువరించె
నెన్న వెలుగోటితిమ్మయ | చిన్నతిమ్మ
మహి మహేంద్ర కుమారతిమ్మక్షితీంద్ర. 261

సీ. రామరా జెఱదిమ్మ | భూమీశుపంపున
మలఁజొచ్చి బోయల | బెళుకుఁ దీర్చె[1]
ముస్తఫా ఖానుని | ముస్తీదుఁ[2] జెడఁ దోలి
భద్రగజంబులఁ | బట్టితెచ్చె[3]
మొనసి దేవరకొండ | మూఁకలు వచ్చిన
ఘోరాజి శిరములఁ | గొట్టివేసెఁ[4]
జలపట్టి[5] యిభరాము | శాహు పంపుల నెల్ల
ధరఁ గృష్ణసాక్షిగాఁ | దఱిమి గెల్చె[6]

నిట్టి విజయంబు లెన్నిలే | వెన్నిచూడ
రాజమాత్రుండె వెలుగోటి | రాయపేంద్రు
తిమ్మఘను చిన్నతిమ్మధా | త్రీశసుతుఁడు
మహితయశుఁడు కుమారతిమ్మప్రభుండు. 262

మ. అళిరామ ప్పెఱ[7] దిమ్మరాజమణియు | న్నా వేంకటక్ష్మాపుఁడుఁ[8]
సెల వన్నంతనె యేఱు దాఁటి గడెలోఁ | జిట్టేల పేరూరు దే

---

1. A. B. బెగడుదీర్చి
2. ,, ముస్తీబు
3. ,, తెచ్చి
4. ,, వేసి
5. ,, చనకి
6. ,, గెల్చి
7. A. హరిరామప్పర
8. A. B. క్ష్మాపతిఁ

పులప ల్నాగులపాడు నాడపలియు ఽ న్నువ్వెత్తుగాఁ[1] జేకొనన్
భళి ! వెల్గోటికుమారతిమ్మఁడు ధరా ఽ భర్తల్ భయుం బొందఁగాన్. 263

మ. రఘురాముం డెఱదిమ్మరా జనుపఁగా ఽ రంజిల్లహన్మంతుఁడై [2]
ఖగరాజై వెలుగోటితిమ్మఘనుఁడే ఽ గాంభీర్యశౌర్యంబులన్
బగవారిం దెగటార్చి రాజహితుఁడై ఽ భాసిల్లె నెల్లప్పుడున్
దగు నార్యాజుకు మన్నెశేఖరునకున్ ఽ దద్వైఖరిన్ బోల్పఁగన్. 264

చ. తివిరి నితాంతకుంతమునఁ ఽ దిమ్మనృతిమ్మవిభుండు గ్రుమ్మినన్
యవనులు నేలఁ గూలు సమ ఽ యంబున నాలుక సాఁచి తత్తను
స్స్రవదరుణంబుఁ గ్రోలి పెలు ఽ చన్ దిశ లల్లలనాడఁ ద్రేఁచు[3] భీ
మవిధిని గొండవీటికడ ఽ మండలదీవిని భూతజాలముల్. 265

వ. అతని కుమారుండు. 266

సీ. తన జనార్దననామ ఽ మునకు భూషణముగా
జనులఁ బోషించు నా ఽ సక్తిఁ దాడరి
భూపతిత్వము దాల్చు ఽ భువనమోహనమైన
సౌందర్య[4]విభ్రమ ఽ చ్ఛాయఁ బ్రబలి
బంధుమిత్రామాత్య ఽ సంధానసౌభాగ్య
పరమసంపత్కర ఽ ప్రౌఢిఁ దనరి
సింహాసనమున వి ఽ చిత్రకారణముగా
సకలపాండిత్యంబు ఽ సంగ్రహించి
పూని రేచర్లకులవార్ధి ఽ పూర్ణచంద్రుఁ
డనఁగ మూరకపురిచెన్నుఁ ఽ డవతరించె
వేడ్క వెలుగోటిగనితిమ్మ ఽ విభుకుమార
తిమ్మయప్రభుచెన్న పృ ఽ థ్వీశ్వరుండు. 267

---

1. A. B. ఉచ్చారణ సామ్యమువలన భ్రమపడి కవి 'వు' 'ఉ' లకు యతి మైత్రికల్పించి యుండవచ్చును.
2. ,, రఘురాముండెఱదిమ్మరాజు వద్దన్ రంజిల్లు హనుమంతుడై. ఇందు వర్గప్రాసముపయుక్తము.
3. B. ద్రెచ్చు
4. A. B. సౌంపార

వ. అతని యనుజుండు. 268

ఉ. సంతతదానకర్ణుఁడు లసద్గుణపూర్ణుఁడు రూపరేఖికా
కంతుఁడు సర్వభూమిధవ కాంతుఁడు మారుతవేగవాజరే
వంతుఁడు నిర్వితర్క[1]బలవంతుఁడు మత్తగజాధిరోహణా[2]
క్రాంతుఁడు తిమ్మభూవిభుఁడు చక్రిసమానుఁడు రాజమాత్రుఁడే. 269

క. అల గనితిమ్మధరిత్రీ
తలనాథలలాము కూర్మి తమ్ముఁడు కరుణా
జలధి [3]పినకొండనరపతి
వెలయుఁ సకలార్థినిలయ విబుధద్రుమమై. 270

సీ. హరివీరవరలంఘు నావమానంబున
గౌరవం బెడలని కంధిరాజు
జంభారిదంభోళిసారధారాహతిఁ
బక్షముల్ గోల్పోని ధర్మశిఖరి
పృథ్వీమరుజ్జయాపేక్షఁ 'గుంజర' యంచు[4]
బొంకు బొంకని ధర్మపుత్రకుండు
రాధేయుదృఢబాణబాధ పీటికి[5] భీతి
నొంది పాఱని శక్రనందనుండు
సాటి సవతు సదృక్షంబు సన్నిభంబు
వితతగాంభీర్యధైర్యసూనృతపరాక్ర
మముల వెలుగోటిపినకొండమనుజనాథ
మకుటమాణిక్యమునకు భూమండలమున. 271

[6]*సీ. గంభీరమగు నంబు గర్భంబున ఘటిల్లి
కూర్మాసనంబుపైఁ గుమురు కొనియుఁ

---

1. A. B. నిర్వితర్కక్ష
2. „ రోహణ
3. „ జలనిధి
4. A. మంత ; B. కుంత
5. A. భాదావీధికి ; B. బాధవీధికి
6. The verses marked with * have been extracted by the compilers of this chronicle from the Bhānumatīpariṇayam of Renṭūri Rangarāju.

దీక్ష్ణమైన వరాహ దేవదంష్ట్రాంకుర
సూచికాగ్రంబున సొంపు గనియు
ఘోరమైన యనంతకుండలి భోగ[1]ప్ర
దీప్తభాగంబునఁ దేజరిలియుఁ
గఠినంబులైన దుర్గమమహా[2]శైలేంద్ర
వికటరూపంబుల విరివి గొనియు
ధీరతప మాచరించి ధాత్రీవధూటి
నిల్చు వెలుగోటిపినకొండ నృపశశాంకు
సంకుమదపంకసంకీర్ణ కుంకుమాంశు[3]
మిళితకేయూరమణిభుజార్గళమునందు. 272

మ. అల ధీరుండగు పిన్నకొండపకు రత్యాకార తిమ్మాంబ ని
ర్మలధర్మోజ్జ్వల[4] యక్కమాంబ తరుణీరత్నంబు సింగాంబయుఁ
గల రంచత్కరుణా[5]క్షమాపతిహితైకశ్రీల శ్రీ[6]భూమినీ
ళలచందంబున నాత్మభర్తకు మనోల్లాసంబుఁ గల్పించుచున్. 273

శా. ఆతిమ్మాంబకుమారకుల్ మెఱసి రత్యాశ్చర్యమార్తాండలీ
లాతేజుండు కుమారతిమ్మపయు హేలావారకాంతామణీ[7]
చేతోజాతుఁడు కోనధీరుఁడు బుధశ్రేణీనుతాఖ్యాతి[8]వి
ఖ్యాతుండౌ పెదకొండశౌరి సుబలుం[9]డారాయభూపాలుఁడున్. 274

శా. అక్కాంబామణి కాంచె రంగవిభు నేచాధీశుఁ దిమ్మక్షమా
భుక్కోటీరుని, సింగమాంబ మదనాభుఁ[10] బెద్దతిమ్మప్రభుఁ

---

1. A. B. యోగ
2. B. P. హోమ
3. A. B. కుంకుమంబు
4. B. P. ధర్మాఖ్యల
5. A. B. గలరంచత్కరుణ
6. ,, స్త్రీ
7. ,, కుమారతిమ్మఘనుఁడేలాగంధచూడామణీ
8. ,, ఖ్యాత ; B. P. ఖ్యాతి
9. ,, సులభుండు
10. ,, మదనాధుఁ

దిక్కోటీయుతసాంద్రచంద్రరుచికీ ర్తిన్ బిన్నతిమ్మప్రభున్
వాక్కాంతాపతి[1] గాండకీరుఁ గనియెన్ వారాశిగంభీరునిన్. 275

వ. తత్కుమారవర్గంబునందగ్రజుండు. 276

సీ. తనువాసనాధైర్య ధర్మాణిమాహులఁ
గాంచనాచలధర్మ కలనవాఁడు
మతిభోగ[2]శక్తిసంతతవిష్ణుభక్తుల
శారదేంద్ర[3]కుమార సరణివాఁడు
నతపోవణారూప నయశౌర్యరేఖల
హరిభావభవగురు స్ఫురణవాఁడు
బలశౌభ్య[4]దానకృపావిశేషంబుల
రామచంద్రఘనాభ రతులవాఁడు
నిహతసామంతసీమంతి సీనితాంత
తాంతహృదయాంత కాంతసంతాపదశది
శాంతవిశ్రాంతకీర్తిల తాంతకుంత
కాంతుఁడు కుమారతిమ్మభూకాంతుఁ డలరు. 277

సీ. సంతతసత్యభాషణము లాతనిసొమ్ము
లతివేలతరధర్మ మతనిసొమ్ము
భవ్యప్రసాదసౌభాగ్య మాతనిసొమ్ము
ఆశ్రితావనఫల మతనిసొమ్ము[5]
దానవాహితపదధ్యాన మాతనిసొమ్ము
మితిలేని సంపద లతనిసొమ్ము
వలరాజుఁ బురుడించు చెలువ మాతనిసొమ్ము
ఆహవకౌశల మతనిసొమ్ము

1. A. B. వాక్కాంతామతి
2. ,, మతిభాగ
3. ,, శారదేందు
4. ,, శౌర్య, 'శౌచ' అనియుం బఠింపవచ్చును
5. ,, ఆశ్రితానఖలమతనిసొమ్ము

యన్వయోచితసంవృత్తి యతనిసొమ్ము
అఖిలవృద్ధోపసేవ[1]నం బతనిసొమ్ము
అనుచు లోకులు వినుతింప ఘనత కెక్కె-
సుప్రభుండు కుమారతిమ్మప్రభుండు. 278

క. ఆనయసీరధియనుజుఁడు
కోనయ శాత్రవులఁ దృణముఁ గొఁటికింపఁగఁ[2] బా
డైన యవసంబు[3] దన్మహి
శానయనాంబువులఁ బసువులకుఁ గాఁ బెరుఁగున్. 279

చ. తదనుజుఁ బెద్దకొండవసుధావరు మార్కొని త్రెవ్వి[4] నెవ్వడిన్
త్రిదశపురంబుఁ జొచ్చిన యరిక్షితిపాలురనెత్తు రుత్పత
త్పదనఖలాక్షలై కటికిఁ బావడలై వలిగుబ్బదోయికిన్
గదురు జవాదియై రతి నొకానొక చెల్వొడఁ గూర్చు రంభకున్.[5] 280

ఉ. ఇమ్ములఁ బెద్దకొండధరణీశ్వరచంద్రుఁడు దాడివోవుచోఁ
గమ్మలు వ్రాయ సర్వకటకంబుల కాఁపులు దారిఁ బాటిలో
కమ్మలు బోయమూఁక లనఁగా నిలు పోపక పోదు రానినన్
గుమ్మలు పోవు లోక మెఱుఁగున్ దమపార్జితహేతిధారలన్.[6] 281

సీ. మాంసల[7]ప్రతిపక్ష మండలేశ్వరమహో
న్నతకంధరంబుల నఱికి నఱికి
వికటాభియాతి పృథ్వీనాథఘనవిగ్ర
హోరుచర్మంబుల నొలిచి యొలిచి[8]

---

1. A. B. వృద్ధావసేవ
2. „ గొరికింపంగాబా
3. „ యవసరంబు
4. „ త్రెల్వి
5. „ రతినాకానాకుచల్వడగూర్చురంభకున్
6. „ కమ్మలు పోయి సర్వకటకంబులకా ఘనుదాకి పారి లో
కమ్ములు బోయమూకలనగా నిలుపోపకపోదురానినన్
కమ్మలు పోవులోక మెరుగున్ తదుపార్జితధాజాతికిన్.
7. „ మాంసత
8. A. వికటాభియతపృథ్వీనాయక విగ్రఘనహోరుచర్మంబులు వొలిచి వొలిచి
B. ...హేమ ...

ఖలవైరి[1] ధారుణీ తలనాథమృదులాంగ
తతులను[2] జక్కఁగాఁ దఱిగి తఱిగి
ముష్కరారాతిమ స్తిష్కాస్థికర్పర
కోటిఁ దుత్తుమురుగాఁ[3] గొట్టి కొట్టి
రూఢి నీఖడ్గసూపకారుఁడు రణోర్వి
వివిధభూతావళికి విందు వెట్టు నార
వెలయ వెలుగోటిపినకొండ విభుకుమార
భువననుతశౌర్య పెదకొండ భూపవర్య. 282

క. ఆయన కూరిమి యనుజుఁడు
రాయనరాధిపుఁడు దానరాధేయుఁడు భూ
నాయకరత్నము కన్నడ
రాయార్పితరాజ్యసుఖనిరతుఁడై యొప్పెన్. 283

సీ. సత్యభామాసము జ్జ్వలుఁ డౌట సంఫుల్ల
రాజీవనయనవి రాజి యగుట
నలఘుగోత్రధురీణుఁడగుట నగణ్యకా
రుణ్యదాక్షిణ్యని రూఢుఁ డగుట
సంపూర్ణసత్త్వని శ్చలుఁ డౌట సదనంత
భోగివిహారవి స్ఫురితుఁ డగుట
నురుపుణ్యజనదుఁడై యుంటఁ గృష్ణావర
జీవనసంగతిఁ జెన్నుగనుట
సిద్ధకృతవర్మరక్షణ శీలుఁ డౌట
నాప్తమిత్రకృతాక్రూరుఁ డగుట విలసి
తాధికానకదుందుభి యగుట వెలసె
రాయనరపతి ఖడ్గనారాయణాఖ్య. 284

సీ. కట్టించె లోకవిఖ్యాతంబుగా వారి
వారణంబులు వారి వారణములు
నిలిపె నెల్లెడల నెన్నిక కెక్కఁగా భూమి
సురగృహంబులు భూమి సురగృహములు

1. A. B. ఘనవైరి
2. ,, తరలంబు
3. ,, మస్తిష్కహస్తి కపాలకోటి తుత్తెనలుగా

చేపట్టె నూర్జిత । శ్రీ లెసంగఁగ[1] ధర్మ
శాస్త్రంబులును ధర్మ । శాస్త్రములును
గాంచె నక్షీణల । క్షణయుక్తి సుకృతిసం
తతులును సుకృతిసం । తతులు వెలయ
నిచ్చె విద్వత్కవీంద్రుల । కెలమి నగ్ర
హారములు పేరుగల యగ్ర । హారములును[2]
సవిధగుండాలవేంకట । స్వామిగాక
రాజమాత్రుండె వెలుగోటి । రాయఘనుఁడు. 285

సీ. ఘోటనిరాఘాట । ధాటిచేఁ బరిపంథి
పట్టణంబుల ధూళి । పటల మాడ[3]
డమరథమామికా[4] । థమథమధ్వనులచే
గిరిదుర్గములు తల । క్రిందు గాఁగ
ఘనధైర్యగుణధుర్య । గతిశౌర్యములఁ జేర్చి
ముగురురాజులు కప్ప । ములు వహింప[5]
స్వామితంత్రద్రోహి । జననాయకుల నాజిఁ
దఱిమికొట్టును వనాం । తరములఁ బడ
భీమసైన్యబలోద్ధూత । భూమిరేణు
రాజిచుళుకితనిఖిలధ । రాధరుండు[6]
విభవభరితుండు పినకొండ । విభుసుతుండు
రసికసులభుండు వెలుగోటి । రాయఘనుఁడు. 286

---

1. A. B. శ్రీలెసంగుచు
2. ,, కాంచన[క్షీ]ణలక్షణయుక్తి సుకృతిసంతతులు వెలయవిద్వత్కవీంద్రులకెలమి నగ్రహారములు పెరుకల నగ్రహారములను
3. ,, ధూరిపటములాడ
4. A. రణథమామీ థమాధ్వనులచె B. రణథమాథమథమధ్వనులచే
5. A. B. వహించె
6. ,, నిఖిలధరాధరుండు

సీ. ఇమ్మైన సొమ్ముకా[1] | యింతిపే రే మది
యొకగొండిపేరింటి | యువిద యేది
మేడపేరన నగు[2] | మించినసఖి యేది
తగఁజేతిపేరిటి | తరుణి యేది
వివరించుమాటలు | వినుపేరి సఖి యేది
మొకములపేరింటి[3] | మొలఁత యేది
నలుదిక్కులకు నొక్క | నలినాక్షిపే రేది
రత్నంబుపేరిటి | రమణి యేది
రమణులకు [నెల్ల] నొక్కఁడై | రాజురాజు
దశమినవముల లెక్కింపఁ | దగిన సతులు
అందులను[4] గల్గుభావంబు | లానతిమ్ము
సరససత్కవిసద్గోష్ఠి | సార్వభౌమ
వెలయ వెలుగోటిపినకొండ | విభునిరాయ. 287

సీ. కలికి సొంపున[5]ఁ బల్కు | విలుకోపునను బూని
వృక్షమహా పేరిట | వెలయు నొకటి
వదరుఁ గూఁతలపేరఁ[6] | బొదలి చెట్టుగ నిల్చి
నదితోడఁ గూడంగ | విదిత మొకటి
యరికట్టుమాటలోఁ | గరఖడ్గ మొనరించి
రాజాన్న[7]రుచులలో | రమ్య మొకటి
వలనుగా దని పిల్వ|వచ్చిన పేరితో
నరయ ఝుంకారించు | గరువ మొకటి[8]
తివిరి భావంబు చతురత | తేటపడఁగ
నర్థ మిది నాల్గుదెఱఁగులు | నానతిమ్ము

1. A. సోమ్మురా
2. A. B. మెడపెరననగుచు
3. ,, మెకముతల
4. ,, అందరను
5. ,, సొమ్మున
6. ,, వదురుగూతలపేరు
7. B. రాతాన్న
8. A. B. వచ్చును పేరిలో......గురుతుదాని

సరససత్కవిసద్గోష్ఠి । సార్వభౌమ,
వెలయ వెలుగోటిపినకొండ।విభునిరాయ.[1] 288

సీ. కుంతలావంతిక।కురు [విదేహ] విదర్భ
[2]మోహనభూముల । మొలక మొల్చి
కాశ్మీరకాంభోజ।కరహాటకర్ణాట
వింధ్యదేశములందు । వేళ్లు పాఱి
పాంచాలబర్బర।బాహ్లికఘూర్జర
సింధుదేశములందుఁ । జిగురు లొత్తి
అంగవంగకళింగ।బంగాళనేపాళ
పుణ్యదేశములందుఁ । బూచి కాచి
ఘనత కెక్కెను నీదాన।కల్పతరువు
లరిజయోపాయ పట్టుత।లాటరాయ
ప్రకటధౌరేయ వెలుగోటి।పార్థివేయ
విక్రమోపాయ పినకొండ।విభునిరాయ. 289

సీ. మదవిరోధుల[3] శిరో।మణులు నేత్రంబులు
దర్పితారాతికే।తనము పడగ[4]
దుర్మదవిద్విష।చ్చర్మంబు కుబుసంబు
శత్రువరాట్టహా।సంబు ప్రోఁత
శాత్రవరాజన్య।శల్యముల్ కోరలు
సమదారివీరర।సంబు విషము
బిరుసైనపగతుర । ప్రేవులు జిహ్వాలు
వినుతరాడ్జీవాని।లములు భుక్తి[5]

1. A. B. రాయవిభుని
2. ,, విదర్భమోహన భూములలదు
3. ,, మదవద్విరోధుల
4. ,, పడిగ
5. ,, మదితరాడ్జీవానలముభుక్తి గాఁగ

గాఁగ[1] సోలుచు నాడుచుఁ గడిమి[2] మెఱసి
రణశిరంబున[3] నిల్చు ఘోరాహి యనఁగ
సరగఁ[4] గ్రీడించు నీఖడ్గసర్పరాజు
విమలచారిత్ర పినకొండవిభుసుపుత్ర. 290

సీ. కరమెత్తి నీకు మ్రొక్కనిరాజు లెవ్వరు
గర్జించు బల్లర గండబిరుద
కలనిలో[5] నీకుఁ జిక్కనిరాజు లెవ్వరు
మదవైరివీరదుర్మదవిదారి
అనిలోన నీకు నోడనిరాజు లెవ్వరు
రమణీయఖడ్గనారాయణాంక
వసుధలో నిన్నుఁ గొల్వని రాజు లెవ్వరు
కొసరక రేచర్లగోత్రధర
అనుచుఁ గొనియాడుచురు నిన్ను నాంధ్రయవన
మగధమాళవనేపాళమత్స్యసభలఁ
బ్రకటధారేయ వెలుగోటిపార్థివేయ
విక్రమోపాయ పినకొండవిభునిరాయ. 291

క. మతి నభ్యసింపవచ్చును
బ్రతి లేదన సకలకళలు[6] రాబివి రెండే
యతిదుర్లభములు విక్రమ
వితరణములు పిన్నకొండ విభురాయనృపా. 292

ఉ. రాయపనాయఁ డాసుకవి రాజమరున్మణి తిమ్మధారుణీ
నాయకుఁ డాసమస్తజన నాథశిరోమణి పిన్నకొండధా
రేయుఁడు నంతకంటె సుచరిత్రుఁడు తత్తనయాగ్రగణ్యుఁడౌ
రాయపనేఁడుఁ బూర్వులతెఱంగునఁ బ్రస్తుతికెక్క ధారుణిన్. 293

---

1. A. B. కణగి
2. B. కరిమి
3. A. B. పురంబున
4. ,, చెలగి
5. ,, కదనమున
6. ,, కథలు

వ. అతనియనుజుండు. 294

గీ. ఆమహాబలు సోదరుం డతిశయిల్లుఁ
బ్రతిభటుల గెల్చు నక్రూరభావ మలర
మెలఁగి యుద్ధవినీతుల మే లెఱింగి[1]
ధరణి వెలుగోటిరంగభూవరవిభుండు. 295

క. రంగక్షితిపతి సాక్షా
ద్రంగపతిం దెలిపె నతఁడు రంతైకదయా
సంగతి నతిసాత్త్వికబు
ద్ధిం గమలావిభవసంభృతిం బరికింపన్. 296

*స్రగ్ధర. స్తంభీభూతక్షితీశాతతపటహాధణంధాణశబ్దంబు నింటన్
గంభీరాయోధనప్రాంగణహతయవన గ్రామణీ కోటిహృద్య[2]
ద్రంభావైవాహవేళాధ్వనితనిబిడవాద్య[3]స్వనంబై తగం బ్రా
రంభించున్ రంగభూపాగ్రణి పటుజయయాత్రల్ బలోద్దండలీలన్.

వ. అతనియనుజుండు. 298

ఉ. ఈక్షితిఁ గాశికానగరి నీల్గిన మాత్ర లభించు నెంచఁగా
భిక్షుపుఁ గూడు యోచపృథివీ[4]తలనాథవతంసు ఖడ్గధా
రాక్షతి మేను వీడిన యరాతికిఁ గల్గు సుధారసంబు త
ద్భైక్షము మంచిదో యమృతపానము మంచిదో యెంచి చూడఁగన్.

సీ. పటికంపు శిలలలో పలినీడ నీవెంట
వచ్చునె పిలిచిన వామనయన
పువ్వారుఁ దీగెలు బోండ్లె నీబడి నిట్టు
లనుచరింపఁగ[5] ధవళాబ్జగంధి
శృంగంబుపై నున్న సింగంబు లాప్తులె
తలయెత్తి[6] చూడను దలిరుఁబోడి

---

1. A. B. మే లెఱింగ
2. B. P; A. B. హతయవనకోటికుద్య
3. A. B. తూర్య
4. ,, ధరణీ
5. ,, పువ్వారు దీగెలబోండ్లు నీబడియెట్లు ననుచరింపగ
6. ,, లాత్మలె తలయెత్తి

పన్నగాననము క్తిపవనంబు శీతమె
సేదార్చుకొనఁగ నోసింహమధ్య
యహహా వశమె పురాకృతమవ ఘుళింప[1]
ననుచు సఖి పల్కు నీశత్రు నబలఁదెలియ
సమరరఘురామ చేచర్లసార్వభౌమ
కొండభూపాలయేచభూమండలేంద్ర. 300

సీ. *జంభారితనుజాత జంభారితనుజాత
సమభోగరూపశౌర్యములవాఁడు
గంధవాహకుమార గంధవాహకుమార
సమవేగశక్తిసత్వములవాఁడు
కుంభినీధరరాజకుంభినీధరరాజ
సమరమాశౌభ్య[2]ధైర్యములవాఁడు
రాజశేఖరమిత్ర రాజశేఖరమిత్ర
సమభూతిరుచినిధానములవాఁడు
జగతి నితఁడనఁ బరఁగుఁ బ్రస్థానసమయ
కల్పితాభీల[3]పటహభాంకారనినద
ఘటితపటుకర్ణకుహరదిక్కటమదావ
ళేశ్వరుండైన[4] యేచధాత్రీశ్వరుండు. 301

వ. అతనియనుజుండు. 302

సీ. చెలపాది[5]కుటిలుండు చేఁదు[6]పుక్కిటనుండుఁ
జుట్టుగాఁ దిరుగాడుఁ బుట్టనుండుఁ[7]
బామరిరాలలోఁబడి పావనుఁడుగాఁడు[8]
నిర్దయుం డేప్రొద్దు నిద్రపోతు

---

1. A. పురాకృతంబా భరింప
2. A. B. శౌర్య
3. B. P. కల్పితాఖిల
4. ,, మదాపధీశ్వరుండైన
5. A. B. 'చదిపాద'. 'చలపాది' సరియైనరూపము
6. ,, చెందు
7. ,, చుట్టులాడిదిగాదుపుట్టగుండు
8. ,, పామరిరాలలో (A. మో) పరిపవనుడుగాడు.

నయ మెఱుఁగఁడు ప్రజాక్షయకారి నడవడి
చక్కఁగా దెంతయు[1] నిక్కలాఁడు
గబ్బి క్రూరుఁడు భయంకరుఁడు దబ్బఱకాఁడు
గణుతింపఁ బెక్కు నాల్కలుగలాఁడు[2]
శేషుఁ డని రోసి భూకాంత చేరి యాడు[3]
ప్రేమ మీఱంగ నీబాహు[4]పీఠ మందు
భవ్యచారిత్ర కొండభూపాలుపుత్ర
ధీరతాటోప వెలుగోటితిమ్మభూప. 303

క. అమ్మనుజనాథుకూరిమి
తమ్ముఁడు పెదతిమ్మభూమిధవుఁ డుగ్రసమి
త్సమ్మూర్ఛితభూభువనక
కుమ్మద[5]వద్వీరవైరికులుఁడై వెలసెన్. 304

క. వినుతనయవినయరేఖా
తనుఁడగు[6] పెదతిమ్మవిభుని తమ్ముఁడు వెలయున్
బినతిమ్మక్షోణీపతి
ఘనదానత్యాగవిజితకల్పక మగుచున్. 305

*సీ. కలధౌతకలధౌతకలధౌతనిలయుండు
ఘనసారఘనసారగంధయుతుఁడు
నరసింహనరసింహనరసింహశౌర్యుండు
భారతిభారతిపాటవుండు
వాహినీవాహినీవాహినీశ్వరమంత్రి
సుకుమారసుకుమారశోభితుండు
మణిరాజమణిరాజమణిరాజనిభకీర్తి
కల్యాణకల్యాణకలితతేజుఁ

---

1. A. B. దింతయు
2. ,, ప్రణుతింప పెక్కు నాలుకలవాడు
3. ,, యాడి
4. ,, మీబాహు
5. B. క। కున్మద
6. A. B. ఘనుడగు

డనుచు జగములు పొగడంగ నలరుచుండు
సమదవిమతవసుంధరారమణసింధు
మంథ[1]జగతీధరేంద్రాయమానబాహు
దండబలహారి వెలుగోటికొండశౌరి. 306

ఆ. ఇలఁ బ్రసిద్ధిఁగన్న యీపదుగుండ్రలో[2]
పలఁ గుమారతిమ్మపార్థివుండు
కొండవిభుఁడు రాయమండలపతియేచ
ధీధనుండు పిన్నతిమ్మనయును. 307

వ. కుమారవంతులై వర్ధిల్లి రందు. 308

చ. ధరణిఁ గుమారతిమ్మవసుధాపతి లక్కమదేవిఁ బెండ్లియై
శరధిశరానుభూరిభుజసాగరవేదములంచు నెన్నఁగాఁ
దిరుపతినేని కొండజగతీరమణుల్ బెదవేంకటావనీ
శ్వరుఁ జినవేంకటాధిపరసారమణుం గనియెన్ గ్రమంబునన్. 309

క. నిరవధికలక్ష్మీ నీప్సిత[3]
వరదానగుణాతివైభవమున ధరిత్రిన్
దిరుపతినాయఁడుఁ దొప్పన్
దిరుపతినాయఁడునిభంగిఁ దేజోధికుఁడై. 310

వ. అతనియనుజుండు. 311

మ. పినకొండక్షితిపాలశేఖరుభుజాభీలప్రతాపాగ్నివై
రినికేతంబులు సొచ్చుఁ దచ్చతురనారీభూరిధమ్మిల్లబం
ధనముల్ నెవ్వడి వీడ్చు నాననసుగంధం బానుఁ జుంబించు న
క్కన రాయుల్ వలువూడ్చుఁ[4] జన్నుఁగవ నొక్కున్ బల్లవప్రక్రియన్.

క. అతనియనుజాతు లార్యా
ర్చితు లాపెదవేంకటయ్య చినవేంకటభూ

1. A.B. మంథ
2. „ పరగఁ బ్రసిద్ధిగన్న యీ పదుగిండ్రలో
3. „ లక్ష్మీప్సిత
4. „ వలపూడ్చు

పతి జనతానతులై [ధర]
నుతికెక్కిరి [1]రామలక్ష్మణుల చందమునన్. 313

వ. సంతతికిఁ దిరుపతినేఁడు మొదలు. 314

క. కురుపతి మానోన్నతికి న[2]
మరపతి తద్ఘటితారిమహిమను[3] విలస
ద్గురునకుఁ బ్రతి మతి[4] [గిరిపతి]
తిరుపతినరపతి మహాధృతిఁ నుతికెక్కెన్. 315

క. తిరుపతినరపతి యల దా
మర[5]ధర్మక్షోణిపతికొమారిత ధర్మాం
బ రమాసమఁ బరిణయమై
పరఁగఁ[6] బినకొండతిమ్మప్రభువులఁ గనియెన్.[7] 316

వ. అందగ్రజుండు. 317

చ. తిరుపతినేనికొండజగతీతలనాథు మహోగ్రధాటికా
తురగఖురోత్థభూరజము దూరవిరాగముఖోజ్జ్వల[8]ద్ద్విష
త్కరిగమనాపరంపరకుఁ గంచెలయై పటవాసమై మనో
హరపరిధానమై యహరహం బలుకించుఁ[9] దదీయవల్లభున్. 318

సీ. నలువనెమ్మోముమేడలనాడు[10] తెలిపాప,
పాఁపజందెమునఁ జూపట్టుసామి

1. A. B. నుతు లొప్పిరి
2. ,, వను
3. ,, మరుపతి తద్వైభ్రతుతారి మహీపతి
4. ,, ప్రతినది తిరుపతి
5. ,, దామెర
6. ,, నరనుతు
7. ,, ప్రభుగనియెన్.
Though Pinakonda and Timma are mentioned in this stanza as the only sons of Tirupati, he had also two other sons, Ranga and Krishna, whose valour is described below in stanzas. 322-327.
8. ,, దూరతిరాగముఖాజ్వల
9. ,, యహరహంబులకించు
10. ,, మెడల

సామిచ్చి బలుజెట్టిఁ[1] జంపి నాతనియన్న
యన్నల్లదేవుని యనుఁగు[2] పట్టి
పట్టిముల్ చెఱసాలఁ బెట్టిన దొరమావు
మావులపూవిల్తు మామకొమరు[3]
కొమరుమాటలకు మాఱ్గొట్టిన[4] రాపగ
పగతేవ[5] పేరుబ్బు వాయుపాలు
పాలుగెల్పునఁ గొన్న నేర్పరి వలమురి
మురిపెమున వేల్పుపెద్దను మోచు పులుఁగు
పులుఁగుచెప్పిడితపసిచే పుడుకురాయి
రాయతిరుపతితిమ్మ నీ తాఁగ యశము. 319

సీ. ఉబ్బురెప్పలు విచ్చి బిబ్బిన సౌర నేర్చి[6]
యూరుపుగాలికి[7] నోసరిలదు
కవుడుదేరుకవాసనవుర చేతుల నప్ప
ళించి స[8]గ్గటనిటఁగొంచెపడదు
కైజుట్టుకొన్న సైకపుకసీదు రుమాలు[9]
తుడుపులకోడి[10] గొంగడలకు డిగదు

---

1. A. B. జట్టి
2. A. యన్నల్లదేవర యగ్గుపట్టి ; B. యన్నల్లదేవర యడుగపట్టి
3. B. మామరుకొమారు
4. B. మాటలకుమాన్గాట్టిన
5. A. B. తేన పెరుబ్బు
6. „ నౌరనేర్చి
7. A. ఖాలి ; B. భావి
8. A. B. కపుడు దేరుకవాసన వురచేతులనప్పళించి సగ్యటు నిటకొంచపడదు
9. „ కళిదురూమాలు
10. A. గొరడు ; B. గొడడు

దవులతా బాదు[1] గందపు కాకితంబునఁ[2]
బలుమారు సద్దిఁ[3] బాసిపడను
మధురసాస్వాదమదఘూర్ణమానయవన
పరివృఢా[4]పేక్షణాశ్లిష్ట పవనజనన
తిరుపతినృపాలుతిమ్మభూవర త్వదీయ
ధాటికా ఘోటకఖురోత్థ[5] ధరణిధూళి. 320

ఉ. నీ చిరదానవారితటినీపతి నాని పయోధి యించుఁ ద
త్తేచన[6] వర్ధమానతృణసేవ సమస్తము నిచ్చు దేవతా
నైచికి తత్కరీషభజన న్మణి[7] కల్పక మిచ్చు సర్వదా
త్రాచరణంబు నీవలన నైనది[8] తిమ్మనృపాలశేఖరా. 321

ఉ. దేవమహీజ మందె నొకదిక్కున మంజరి[9] చంద్రుఁ డందెఁ దా
రావళి వార్షికాంబు[10] ధరమందె నుదాహరణంబు నీతసం
భావన మింటివార్తలవి మున్నను నీవలె నెవ్వరందిరెం
తే వసుధాస్థలిన్ దిరుపతిప్రభుతిమ్మ మహాప్రబంధముల్. 322

సీ. శ్రీరామపాదరాజీవయుగ్మమరంద
రసమి[11]ళన్మత్తసారంగ రంగ
పరవరూధిన్యుత్థపటహాదంధణవిస్ఫు
రద్రావనృత్యత్తురంగ రంగ

---

1. B. దవులతో బాదు
2. ,, కాళితంబున
3. ,, నధిన
4. A. B. పరిదృఢా
5. A. ఘురాద్ధధరణీధూళి
6. ,, త। చ్చెచన ; B. చ్చెచన
7. A. B. భజన్మణి
8. ,, ధా। త్రీచరణంబు...నైనధి
9. A. మంజలి
10. A. B. కంబు
11. ,, సమ్మిశ్ర

రిపువపుర్వీగళితాస్రశ్రితజయశ్రీపరి
రంభశుంభద్రణరంగ రంగ
కీర్తినిర్జితకార్తికీచంద్రధవసుహీ
ధ్రపటీరగంగాతరంగ రంగ
సకలసుకవీంద్రగాయకసరసవిబుధ
రక్షదక్షిణవిమలాంత[1]రంగ రంగ
తరుణలావణ్యవిజితకందర్పదర్ప
నిరతశోభాంగ తిరుపతినేని రంగ. 323

సీ. వినవచ్చె నదె నీరవేశ్యాభుజంగుని
జయభేరికాస్ఫురచ్ఛంఖరవము
కన్పట్టె నల్లదె గాయగోవాళుని
ధవళాతపత్రకేతనచయంబు
చనుదెంచె నదె రాయచౌహత్తమల్లుని
గజతురంగానేకఘనబలంబు
మార్కొనె నదె మీఱి మన్నెహంవీరుండు
గాండివివైఖరి గదనమునను
ననుచు నీధాటికిని నోడి యహితు లెల్లఁ
గాన కేఁగిరి నిను నాజిఁ బూనలేక
సూనశరగాత్ర తిరుపతినేనిపుత్ర
సంగరాటోప వెలుగోటిరంగభూప. 324

సీ. గర్వదుర్వారభీకరశత్రునాయక
భూధరంబులకు దంభోళిధార
శుంభద్భుజారంభదంభశాత్రవరాజ
కుంభీంద్రహర్యక్షడింభకంబు
కుటిలప్రచారవిస్ఫుటవైరిభూపాల
జలధరోద్ధూతజంఝూనిలంబు
సంగరపాటవోత్తుంగారిభూనాథ
పాథోధిజిద్బడబాగ్నికీల

1. A. రక్షణ రక్ష విమలాంత; B. రక్షణక్షణవిమలోత్త

నీకరాబ్జాతసంభూతనిబిడహేతి
యూర! యుద్దండవృత్తివీరాగ్రగణ్య
భళిర! వెలుగోటితిరుపతిప్రభుకుమార
రంగధీర మహాహవాగ్రశాత్రవవిదార. 325

చ. దురమున వైరిరాజులను దోర్బలశక్తిని ఖడ్గధారచేఁ
గరకరి గాఁగఁ జంపుదు వఖండితవిక్రమ! రాముకైవడిన్
గురుతరకీర్తిహార వెలుగోటిధురంధర మేలుమేలురా
తిరుపతినేనిరంగ సుదతీనవమోహనపంచసాయకా. 326

సీ. మత్తారిభూపాలమస్తకంబులె కాని
ఖండించ దార నీఘనకరాసి[1]
వైరిధాత్రీనాథవక్షంబులే కాని
వరుస మెట్టదు నీదు వరహయంబు
విరసావనీంద్రుల వెన్నుపైనే కాని
తాఁకదు నీచేతి తఱటువెట్టు
గర్వితాహితరాజగాత్రంబులే కాని
కాలరాయదు[2] నీదుగంధగజము

శత్రుమదభంగ రాజవేశ్యాభుజంగ
దండితారాతి బల్లరగండబిరుద
ప్రకటచారిత్ర తిరుపతిప్రభుసుపుత్ర
కీర్తివిస్తార వెలుగోటికృష్ణధీర. 327

సీ. మత్తవిద్విషబాహుమధ్యవీథులఁగాని
వేడెంబు లిడదు నీ విజయతురగి
కిల్బిషాహితగర్భకీలాలములఁగాని
పానంబు గొనదు నీభద్రకరటి[3]

1. A. B. కరాళి
2. ,, ఖండించదార
3. ,, కరము

గంధాంధ[1] శాత్రవానీకకంధరంబులఁ గాని
చేరదు రోఁటకు నీచేకటారి
ప్రతిభటోద్భటవీరభటకోటిపైఁ గాని
కదియదు నీసముత్కటభటాళి
భళిర ! ప్రతిగండ భైరవపంచపాండ్య
దళవిభాళమహాబిరుదప్రసిద్ధ
విజయవెలుగోటి తిరుపతివిభు[2] కుమార
విమలచారిత్ర కృష్ణపృథ్వీకళత్ర. 328

వ. ఆపెదకొండప్పనేని వంశావతారం బెట్టి దనిన. 329

క. ఘనుఁడు పెదకొండభూపతి
ఘనకైశిక యల్లమాంబికం బరిణయమై
కనియెఁ బెదతిమ్మవిభుఁ జె
న్ననరేశుని వేంకటాద్రినాథవరసుతున్[3]. 330

వ. అందగ్రజుండు. 331

ఉ. ధీ యని పెద్దకొండజగతీవరు తిమ్మనృపాలుఁ డాగ్రహ
ప్రాయమనీషి వాఁడిఁ బలుపక్ వెలి పగ్గలమై[4] తెరల్పఁగాఁ
బోయి విరోధు లుగ్రవనభూములు సొచ్చి ఫలచ్ఛదోదక
స్వీయ[5] విధేయులై యనుభవింపుదు రుగ్రతపస్విధర్మముల్. 332

వ. అతని యనుజుండు. 333

సీ. అరిమనోమండలంబు బర్కమండలమును
భయమంది పటపటపటనఁ బగుల
రణభోగసంవ్యాప్తి రంభావధూప్రాప్తి[6]
తమకించి తటతటతటను నదర

---

1. B. గంధాంబ
2. A. B. ప్రభు
3. B. తిమ్మబరువిభు చన్ననరేశు వెంకటాద్రినాథవరసుతుల్
4. ,, వెలపగ్గలమై
5. ,, స్థేయ
6. A. రంభావసవ్యాప్తి B. రంభాపసవ్యాప్తి

ఘటపంతరవము నుద్భటకుంతరవమును
చెనఁగొని పెటపెట పెటను నెగడ[1]
శరనికాయంబును శాత్రవనయనాశ్రు
తోయంబు తొటతొట తొటను దొఱఁగఁ[2]

చిత్రమైయుండు నీదండయాత్రమహిమ
ధాత్రి ముక్తాతపత్రితోద్దండకీర్తి
విభవవిస్తార పెదకొండవిభుకుమార
సింధురాటోప వెలుగోటిచెన్నభూప. 334

వ. త దనుజుండు. 335

చ. కలగలరాజు నిండుదయ గల్గినరాజు మొగంబునందు న
వ్వలరెడురాజు నీతి వినయంబుల మించినరాజు శాంతిచే
బలసినరాజు పాడియును బంత మెఱింగినరాజు కీర్తులన్
వెలసినరాజు కొండవిభువేంకటనాథుఁడు రాజమాత్రుఁడే. 336

ఉ. శ్రీలలితుండు వైరిగజసింహుఁడు దాతలచక్రవర్తి ది
క్కీలితకీర్తి నీతిపదఖేలనలోలుఁడు ధర్మకర్మసం
శీలుఁడు సుప్రసన్నగుణసింధువు మాపెదకొండధారుణీ
పాలునివేంకటాద్రి ధృతి పాకహిమాద్రి నృపాలమాత్రుఁడే. 337

వ. సంతతికిఁ జెన్నప్పనాయఁడు మొదలు. 338

సీ. గండికోటాదిదుర్గము లనర్గళశక్తిఁ
జలపట్టి సాధింపఁగలఁడె యొకఁడు
కుతుపనమల్కాపం పతిభయంకరవృత్తి
గదిసిన డీకొనఁగలఁడె యొకఁడు
కయ్యంబులో మన్నె కంఠీరవులకెల్లఁ
గన్నాకుగా నిల్వఁగలఁడె యొకఁడు
తననిజస్వామికి ఘనజయాంగనలను
గైకానుకలు సేయఁ గలఁడె యొకఁడు

1. A. B. లనుగొని పెటతటతటనునదుర
2. ,, తమకించితటతటనునదుర

నీవిధంబునఁ గలిననిర్ణిద్రయవన
వాహినీఘోరరక్తప్రవాహనివహ
నవ్యసంధ్యాయమానపేన్నాజలౌఘ[1]
చిత్రితాటోప వెలుగోటిచెన్నభూప. 339

సీ. నీపేరు చెప్పిన నిష్ఠురారాతిబిం
బోష్ఠుల గర్భంబు లూడిపడును
నీడాకఁ జూపిన నిర్ధూమధామమై
పరభూము లూడనిఁబాడుచుండు
నీపంపుమాత్రాన నిజభుజాహంకార
మన్నరాజన్యుల మదము లణఁగు
నీవు ముట్టిడైన నిఖిలదుర్గాధిప
ప్రకరంబు గుండెలు పగిలిపాఱు
సాహసంబున నీయంత సార్వభౌముఁ
డరయ నెవ్వాఁడు మూఁడు సింహాసనముల
భూరిగుణహార వెలుగోటిపురవిహార
భాగ్యసంపన్న కొండభూపాలుచెన్న. 340

ఉ. క్రొత్తలుగాఁగ నేఁడు వెలుగోటిధురంధర చెన్న నీవు దం
డెత్తినవార్త [మున్మును] పోకింత వినంబడె నేని భీతిమై[2]
మత్తవిరోధిరాజు లభిమానము లూడిచి యెక్కడెక్కడేఁ
జొత్తురుగాక నీ కెదురు శూరులు లేరు ధరాతలంబునన్. 341

సీ. యక్షరక్షఃకులాధ్యక్షశిక్షణ[3]దక్ష
దీక్షోపదేశి నీదృఢబలంబు
జంభసంభేదిదోస్తంభదంభోళిసం
రంభగుంభనము నీరణవిధంబు

---

1. A. B. నవ్య సంధానమానపెన్నాజితౌఘ
2. ,, దం।డెత్తినవార్త యొకింతవినంబడెనేనిభీతిమె
3 ,, అక్షరక్షఃకులాధ్యక్షవీక్షణ

ఘోటఘోటీనిరాఘాటధాటీసము[1]
త్పాటితక్షోణి నీప్రబలధాటి
భీమభీమాలికాక్షామధూమధ్వజ
స్థేమధామంబు[2] నీతేజ మహహ
ప్రస్తుతింపంగఁ దరమె దుర్వారవిరోధి
కంఠరక్తావగాహోగ్రఖడ్గజనిత
విజయరేఖాధరీభూత[3]విక్రమార్క
వీర్య[4]సంపన్న పెదకొండవిభుని చెన్న. 342

ఉ. బల్లిదమైన బెబ్బులికిఁ బాఱుమృగంబులరీతిఁ గాక యా
చిల్లర మన్నెమూఁకలు విజృంభణవృత్తికి నానఁ బూనునా
బల్లరగండమూర్తి రణభార్గవరాముఁడు కొండధారుణీ
వల్లభుచెన్నుఁ డాజి కిదె వచ్చెనటన్న బరువెత్తు మృత్యువుల్. 343

సీ. తారాధిపతియును దారాధిపతియును
దారాధిపతియు నీతరమువారు[5]
కమలాధిపతియును గమలాధిపతియును
గమలాధిపతియు నీకరణివారు
పద్మాధిపతియును బద్మాధిపతియును
బద్మాధిపతియు నీపగిదివారు[6]
ఖచరాధిపతియును ఖచరాధిపతియును
ఖచరాధిపతియు నీకడిమివారు[7]
శేముషీసత్కళాజ్ఞావిశేషమాత్ర
తాపనైర్మల్యవాగ్ధనురైష్ణపుణ్యప్ర

---

1. A. B. ధాటీకనో
2. ,, దామంబు
3. ,, రేఖాదరీభూత
4. ,, వీర
5. A. తరమువాడు ; B. కరణివాడు
6. A. పగిదివాడు ; B. నీకరణివాడు
7. A. B. కరణివాడు

క్షితిరణస్థేమభోగైకవితరణముల
జిష్ణుతాటోప వెలుగోటిచెన్నభూప. 344

వ. అతనికుమారులు. 345

చ. అనుపమలీలఁ గొండవసుధావరు[1] చెన్నని వేంకటాద్రి పా
వనగుణశీలుఁడై యుభయవంశపవిత్రకుఁడై బలాఢ్యుఁడై
ఘనుఁడయి కీర్తిమంతుఁడయి గర్వితవైరివిభాళుఁడై జగ
జ్జనవరపూజ్యుఁడై నిజభుజాసముపార్జితరాజ్యుఁడై మనున్. 346

వ. అతనియనుజుండు. 347

సీ. సకలవిద్యల భోజుసాటికి[2] వచ్చు స
ర్వజ్ఞసింగక్షమారమణుఁ డొకఁడు
బిరుదుమన్నీలపైనుతిమి మ్రొక్కులు గొను
గనితిమ్మధారుణీకాంతుఁ డొకఁడు
శూరులు మెచ్చ నూఱాఱుగెల్పులు గెల్చి
మీఱు కస్తురిరంగశౌరి యొకఁడు
సింహాసనస్థులచేఁ బూజఁ గాంచు మీ
తండ్రి చెన్నప్రభూత్తంసుఁ డొకఁడు
అందఱను మించి పద్మనాయఁకకులంబు
వెలయఁ జేసిన మరువంపుమొలక వౌర
బుధజనాధార వెలుగోటిపురవిహార
యతులగుణజాల వేంకటపతినృపాల. 348

మ. భళిరా! యప్రతిమానదానగుణశుంభన్మానుమఖ్యాతులన్
గలరా నీసరి రాయమన్నదొర లీకర్ణాటకక్షోణిలో
నలనాసత్యశుభాకృతీ విదళితోన్మత్తారిధాత్రీపతీ
వెలుగోటీపురధామ వేంకటపతీ విద్వన్నుతోద్యన్మతీ. 349

---

1. B. వసుధామర
2. A. B. భోజునికిసాటికి

సీ. రాజులలోఁ దిమ్మరాజుదే ధైర్యంబు
మన్నీలలో నీదె మగతనంబు
పెనుగొండనుండి వచ్చిన దాడి[1] తెగువకు
గట్టైన బద్దలు[2] గాక పోనె
దొడ్డ కొంచెముఁ జూచు దొరల గండఁడు[3] వాఁడు
ప్రతిగండభైరవ ప్రతిభ నీది
ఎలగోలు చిల్లరబలము లానవు[4] వాని
పూని నీకై జీతమానె నౌర
వేడ్క నినుఁ జేరె సంగ్రామ విజయలక్ష్మి
రంభ కౌఁగిలిఁ జేరె నా రాజవరుఁడు
భళిర ! వెలుగోటిచెన్నభూపాలపుత్ర
భవ్యగుణశీల వేంకటపతినృపాల. 350

సీ. కొరలెనా బారుల కుఱికి యెంతటి దునే
దారి నైనను జెండి పాఱవైచు
నిచ్చెనా కోర్కెల నిచ్చి తండోపతం
డములుగా నర్థిసంతతులఁ బ్రోచుఁ
జేరెనా హొయలు మిటారికత్తెలకు సా
క్షాన్మన్మథునివలెఁ గానుపించు
నవ్వెనా నిండుపున్నమపండువెన్నెలల్[5]
చల్లి కొల్వెల్ల[6] రంజిల్లఁ జేయు

---

1. A. దాని ; B. దాగి
2. A. గట్టైబద్దలుగాక ; B.. గట్టైబధలు గాక
3. A. గంన్నడు ; B. గున్నడు
4. B. లావు.
5. A. B. వెన్నెలలు జల్లి
6. ,, కొలువెల్ల

నట్టిరాహుత్త[1]సంతతత్యాగభోగ
భాగ్యశాలి పదానతపరనృపాల
పాళి[2] వెలుగోటిచెన్నమ[3]ప్రభుకుమార
హేళి[4] వేంకటపతిమహీపాలమౌళి. 351

సీ. ఒకపాటికుట్ర[5] మన్నకుమాళ్లు[6] నూఱార్లు
కూడినఁ గన్నత్తి చూడఁ గలరె
యటుగాక రాయ లంతటి వజీరులు వేవు
రైనను నీవాటు కాఁగఁ గలరె
డాక నంతటి[7] కిరీటముల రాజులు లక్ష
చేరిన నెదురాని పోరఁ గలరె
మఱి పాదుశాహులె మెఱసి కోట్లకొలంది
నిలచి పోరిన మీఱి గెలువఁ గలరె
బలయు నీ దుముదారుపంపులకు నలుకు
దఁరు మరుత్పుతులైనను దుది నిజంబు[8]
విన్నవించెద వెలుగోటిచెన్నభూమి
పాలకుని వేంకటపతీంద్ర భాగ్యసాంద్ర. 352

సీ. మునుమున్న తనధమాధ్వని[9]విరోధినృపాల
కుల దుర్గములు పెళాపెళలు[10] సేయ
నటు చేరఁ దన తేజి పటుహేష లరిభూభు
జుల గుండియలు గులాగులలు సేయఁ

---

1. A. B. అట్టిరావింత
2. ,, పాలి
3. ,, చెన్న
4. ,, హేలి
5. A. కుట్ర; B. కుట్ట
6. A. B. కుమార్లు
7. ,, నంతటి
8. ,, యిది నిజంబు
9. ,, ధమామిధ్వని
10. ,, పెళాపెళలు

దరి నొక్కఁ దనహేతి తతవైరిరాజన్య
మకుటాగ్రములు వకావకలు సేయ
మఱి మీఱి తనధాటి మహనీయబిరుదాంక
ములు వారిధుల బెళాబెళలు సేయ
మించె నిదె గాయగోవాళపంచపాండ్య
దళవిభాళాదిజాగ్రదుదగ్రబిరుద[1]
పాళి వెలుగోటిచెన్నపప్రభుకుమార
హేళి వేంకటపతి[2] మహీపాలమౌళి. 353

సీ. సర్వజ్ఞసింగభూజాని సద్గుణవార్ధి
యాలవాలంబుగా నంకురించె[3]
నిర్వాణరాయమహాశ్వరమణశౌరి
నవకృపావృష్టిచే[4] ననలుసూపె
గనితిమ్మధారుణీజననాథమూర్ధన్య
జిష్ణువైభవమునఁ[5] జెట్టుగట్టె
మీతండ్రి చెన్నపమేదినీశ్వరు[6] భుజా
శక్తిచే శాఖోపశాఖ లయ్యె
నేఁడు భవదీయసద్గుణానీకగరిమఁ[7]
బూచి కాచి ఫలించె సంపూర్ణకీర్తి
పండఁబాఱిన వెల్గోటివంశశాఖ[8]
ప్రకటితాటోప వేంకటపతిమహీప. 354

---

1. A. జాగ్రదుదగ్ర; B. జాదుదశ్రీ
2. A. B. వెంకటమహీ
3. ,, నంకురించి
4. ,, నవకృపాదృష్టిచే
5. A. మూర్ధన్యముజిష్ణు వైభవమున; B. మూర్ధన్య...ష్ణు వైభవమున
6. A. B. చెన్నపృధ్వీశ్వరు
7. ,, నీపగరిమ
8. ,, పాటవారుని శాఖవెల్గోటివారు

శా. బీటల్ వాఱెను దిక్తటంబు నగముల్ బెట్టూఁగె నంభోనిధుల్
తేటం బాసెను నీటఁ జాడరవిదీప్తిన్[1] మాసెఁ బో నీ డమా
మీఁటోకించిన శాత్రవుల్ చెదర కేమీ నిల్తురే యాజి వె
ల్గోటీచెన్ననృపాలువేంకటపతీ లోకైకరమ్యాకృతీ. 355

శా. అంధీభూతము లా దిగంతరము లుద్యజ్జంతుసంఘంబుతోఁ
గంధుల్ ఘూర్ణిలుఁ గొండ లుర్వెఁ బడు దిగ్దంతుల్ వెసం గ్రుంగు నీ
ధంధంధాణధమామికార్భటికి నై దర్పారిదంభాటవీ[2]
గంధేభా వెలుగోటివేంకటపతిక్ష్మానాథకంఠీరవా. 356

సీ. అనిలోన గెల్చి తెచ్చిన గజంబులఁ[3]గాని
సజ్జారములఁ గట్టి సాకఁబోడు
బిరుదుమన్నకుమార్ల బింబాధరలఁ[4] గాని
చెఱలఁ బట్టించఁ డుద్ధారత మెఱసి
గడివిరోధుల మాంసఖండంబులే కాని
భుక్తిసేయఁడు ఖడ్గభూతమునకు
సాహసోద్భటవీరరాహుత్తులనె కాని
పాటింపఁ[5] డితరభూపతుల సరణి

అతఁడు సంగరగాంగేయవితతశౌర్య
గాయగోవాళఖడ్గనారాయణాది
బిరుద వెలుగోటి[6] చెన్నభూవరసుతుండు
ప్రథనవిజయుండు వేంకటపతిఘనుండు. 357

వ. ఆరాయప్పనేని వంశావతారం బెట్టి దనిన. 358

క. వెలుగోటిరాయనరపతి
కలితమునన్[7] లింగమాంబికం బరిణయమై

1. A. B. జంధిరవిదీప్తుల్
2. ,, దంభావనీ
3. ,, గజంబులనె
4. ,, బింబాధరల
5. ,, పాలింప
6. ,, బిరుదువెలయు వెలుగోటిచెన్న
7. ,, కలితమునలింగ

కులనగధీరుఁ బ్రతాపో
జ్జ్వలు వేంకటనృపు యశోవిశేవర్ధనుఁ గాంచెన్. 359

*శా. ఆరాయక్షితినాథమౌళికి విపక్షాద్రీంద్రదంభోళికిన్[1]
ధీరోదాత్తునకున్ జనించి[2] గరుడాద్రిస్వామి విస్తీర్ణ తే
జోరాశి ప్రకటీకృతాంశుఁ డన మించెన్[3] వేంకటాద్రీశ్వరుం
డారత్నాకరకుంభినీవలయరక్షారూఢకారుణ్యుఁడై. 360

*సీ. శేషాచలేంద్రవిశేషధామంబున
నెలకొన్న విఖ్యాతి నెఱపువాఁడు
బాలార్కరుచి గన్న పద్మరాగంబునఁ
గనుపట్టు నఱచేయి గలుగు[4]వాఁడు
లలితహారంబుల యలమేలు జిగిఁ గూడి
తళుకుమీఱిన యురస్థలమువాఁడు
విబుధకంటకరాజిఁ గబళించు చాయల
డాఁకొన్న పసిఁడి కోటారివాఁడు

ధరణిదేవతలను బ్రసాదములఁ దనిపి
సంతతానంద [మును] గూర్పఁ జాలువాఁడు
వేంకటస్వామిగతి రాయవిభుకుమార
వేంకటస్వామి దిక్కుల వెలయుచుండు. 361

సీ. పౌజు[5]లల్లంతనె పరిపాటిగాఁ జూచి
యుండ కేఁగెదువాని గుండెదిగులు

---

1. B. P. మందాద్రికిన్
2. A. B. జనించు
3. ,, ప్రకటీకృతాంశుఁడు జనించున్
4. ,, నరచాతిగలుగువాఁడు
5. ,, పంజులు

తనసేన కొంచె మాతలి సేన[1] ఘనమని
వీఁగఁ జూచెడువాని । వెన్నుతలటు
తారసించిన చోటఁ । దానెక్కి పొడుచక
బంటుఁజూపెడువాని । కంటుమగఁడు
అరిరాజకరిఘట । లల్లంత నెదిరిన
నిలువని మన్నీల । నొత్తిపిడుగు
అనుచుఁ గొనియాడుచుందు రిన్ను । నర్థివరులు
కురుకొంకణటెంకణ । ఘూర్జసభల[2]
వనధిగంభీర రాయభూవరకుమార
విక్రమోపేంద్ర వెలుగోటి వేంకటేంద్ర. 360

సీ. ప్రాణదానము సేయు । ప్రతిగండభైరవ
యభయ మీ ఖడ్గనారాయణాంక
నేర మెంచకుము హిందూ[3] రాయసురతాణ
దయఁ జూడు రిపుగజ । దళవిభాళ
కాపాడుమీ యన్మగంటిపురాధీశ[4]
కరుణింపు[5] బల్లర । గండబిరుద
రక్షింపు[6] కాకతరాజ్యసంస్థాపక[7]
బ్రదికింపు శశికుల । పరశురామ[8]
యనుచు మ్రొక్కెద రెపుడు నీ యరినృపాలు[9]
రాజకిని నోడి నీపదాంభోజములకు

---

1. A. B. మావలిసేన
2. A. కురుకొంకణ ఘూర్జరాజన్యసభల; B. కురుకొంకణ టెంకణ ఘూర్జ రాజన్య సభల
3. ,, నేరంబులెంచకిందూరాయసురతాణ
4. ,, కాపాడుమనుమగంటి పురవరాధీశ్వర
5. ,, కరుణించు
6. ,, రక్షించు
7. ,, కాకతిరాయరాజ్య స్థాపనాచార్య
8. ,, సోమకుల పరశురామ
9. ,, నీవైరిరాజు

సర్వబిరుదరరాయవే ॥ శ్యాభుజంగ
విక్రమోపేంద్ర వెలుగోటి ॥ వేంకటేంద్ర. 363

సీ. వ్రాలుఁ బెట్టనికమ్మ ॥ వ్రాలసర్గళముగా[1]
నడుప నేసింహాస ॥ నస్థుఁ డోపు
నెట్టికార్యం బైనఁ ॥ బట్టినఁ జలపట్టి
తుద నిర్వహింప నే ॥ దార తనర్పు[2]
విగడియ నూఱాఱు ॥ వేలు గూర్పను విప్ప[3]
ఘనతమై నేన్నృపా ॥ లునకుఁ జెల్లు
సురథాణి గజపతి ॥ నరపతు లాశింత్రు
బలిమి కేమన్నిని ॥ ప్రాపుదాపు
అతఁడు మన్నినిమాత్రుఁడే ॥ ప్రతినృపాల
వర్గసంహారసమరో ॥ గ్రభార్గవుండు
సార్వభౌముండు వెలుగోటి ॥ శాసనుండు
రాయవిభువేంకటాద్రిభూ ॥ నాయకుండు. 364

సీ. దర్పితంబైన ॥ నీతమ్మటధ్వని విన్న
గడిమన్నెమూఁకలు ॥ కలఁగిపాఱు
భీకరంబైన నీ ॥ బిరుదుటెక్కెముఁ గన్న
రిపురాజుసేనలు ॥ ఱిచ్చవడును
చిత్రరంబైన నీ ॥ యుత్తమాశ్వముఁ గన్నఁ
బ్రతిపక్షనివహముల్ ॥ భగ్నమగును
బల్లిదంబగు నీదు ॥ బాహాసిఁ బొడఁగన్న
ఘోరవిరోధుల ॥ గుండె లవియుఁ
జెలఁగి నీధాటిఁ బుట్టిన ॥ చిత్రగతుల
వైరిదుర్గము ల్గజగజ ॥ వణఁకుచుండు
వనధిగంభీర రాయభూ ॥ వరకుమార
విక్రమోపేంద్ర వెలుగోటి ॥ వేంకటేంద్ర. 365

---

1. A. వాలుపర్గంబుగా B. వ్రాలుపర్గంబుగా
2. A. B. తరంబు
3. A. విగుడిబుగోన నూఱాఱునూర్పనువిప్పను

సీ. ఉదుటుమన్నకుమార । మదగర్వభంజన
గొంటు[1]మన్నకుమార । కంటినెరస
విరసమన్నకుమార । విపినదావానల
శత్రుమన్నకుమార । శరభమూర్తి
కంటుమన్నకుమార । కాలాగ్నిరుద్రుండ
వెగటుమన్నకుమార । వెన్నుతఊట
... ... ...
... ... ...[2]

కక్కసపుమన్నెమూఁకల । ముక్కుగోయ్య[3]
కూటువలు గూడుమన్నీల । గుండెదిగుల
వనధిగంభీర రాయభూ । వరకుమార
విక్రమోపేంద్ర వెలుగోటి । వేంకటేంద్ర. 366

*సీ. కలిమి యేమి ఘటించుఁ । గమలేంద్రుఁ గూడిన
రమణికి నుదకపారణమె[4] కాక
యేమి శేషముగల్గు । నిభరాజుల వరించు
కాంతకుఁ బర్ణభక్షణమె కాక
పుణ్య మేమి ఫలించు[5] । భుజగవల్లభుఁ గోరు
వనితకు ననిలభోజనమె కాక
యేఫలం బొదవుఁ గిరీటీశు నందిన యంగ
నకును ముస్తాచర్వణంబె[6] కాక

అనుచు వారల నిరసించి । యవనికాంత
సిరుల రంజిల్లు రాయభూవరకుమార
వేంకటాధిప లోకమ్ము గాంచుఁ గూడి
యనవరతభోగభాగ్యంబు । లనుభవించు. 367

1. A. B. కంటి
2. The third line of the verse is missing in both the Mss.
3. A. ముగోయ్య B. ముకుగోయ్య
4. A. B. వారణమె
5. „ ఘటించు
6. „ ముక్తాచర్వణంబె

*మ. మకరీతోరణపంక్తిమీఱ నవరంభాలీల రంజిల్లఁగా[1]
వికసత్కీర్తిపయోధిఁ బుట్టి ధరణీవిఖ్యాతయా చెన్నమాం
బిక యన్కల్మిచెలి న్వరించె[2] విబుధుల్ మెచ్చన్ సుధాబిందుమా
త్రికపుం బ్రాలలరంగ[3] వేంకటధరాధీశుండు హర్షంబునన్. 368

ఉ. రాయపనేని వేంకటధరాధిపుచే ననిఁ ద్రెవ్వి మింటికై
పోయిన వైరి నెంత వలపో నిలుపోపక[4] చూచుఁ జూచి ర
మ్మా యని చీరుఁ[5]జేరి నిలయం బనకుం గొనిపోవుఁ బోయి పు
ష్పాయుధుకేళిఁ దేల్చు నపురా యలరంభ విజృంభితాంగియై.[6] 369

వ. అతని కుమారుండు. 370

*క. వెలుగోటివేంకటేంద్రున
కలఘుగుణాలంబ చెన్నమాంబామణికిన్
గలిగెను రాయమహీంద్రుఁడు
వలరాయఁడు హరికిఁ బద్మవాసినికి వలెన్. 371

*మ. అధికారాతిమహీధురంధరమహాహంకారనిర్భేదన
ప్రధనోగ్రుండగు వేంకటేంద్రసుతుఁ డై[7] రాయక్షమాభృత్కళా
నిధిచంద్రుం డగు కీర్తిఁ గైకొని బుధానీకంబు మైత్రిన్ ధరిం
పు ధరిత్రిన్ సతతంబుఁ జూచు సుజనంబుల్ మ్రొక్కి కీర్తింపఁగన్. 372

సీ. మొండొడ్డుమన్నీల దండుబారుల కెక్క
గగ్గోలు పఱచు నీగబ్బితేజి

---

1. The reading adopted is that of B. P.
   A. మీఱనపరమ్యాళిల రంజిల్లగా
   B. మీఱిన పరమ్యాళిలరంజిల్లగ
2. A. B. వరించ
3. ,, బాలలరంగ
4. ,, నిలుపోపజూచు
5. ,, మమ్మాయనిచేరు చేరినిలుచుంబనకుం
6. A. విజృంభితాహిలన్
7. ,, సుతుడా

యొరయు రాహుత్తులనుటికి పోనీయక
యరికట్టి[1] నఱకు నీకఱకు హేతి
పోతరించినవైరి భూతలేంద్రులమీఁదఁ
బాతరల్ సలుపు నీబలుకటారి
కంటకద్వేషుల కంఠరక్తముఁ గ్రోలి
మించి గోరించు నీమెఱుఁగుటీఁటె
నీకు నెదురేరి లోభిమన్నీలమిండ
గాయగోవాళ బల్లర గండబిరుద
పౌరుషోదార వేంకట ప్రభుకుమార
నాయకోపేంద్ర వెలుగోటి రాయపేంద్ర. 373

సీ. మహీప[2] హెచ్చరిక దుస్సహసింహళద్వీప
సంబంధమదభద్ర సామజములు
స్వామీ పరాకు జంఝామారుతారూఢ
గాంధారభవమహా సైంధవములు[3]
[4]చిత్తైసు[5] నాథ రంజితమేఘనిర్ఘోష
భీకరారావంబు భేరికులము[6]
అవధారు ధీర[7] చిత్రాభ్రంకషస్వర్ణ
ధళధళద్ద్యుతిరాజి తధ్వజములు
సాళ్వబిరుదాంకముఖ్యరాజాళిఁ[8] గొట్టి
తెచ్చినవటంచు[9] గంచుకుల్ హెచ్చి తెలుపఁ
గనుఁగొనుచు నిండుకొలువుండు ననుదినంబు
రణజయవిహారి వెలుగోటి రాయశౌరి. 374

సీ. ఎటువంటి గుహలలో నేఁగినఁ బోనీఁడు
రవళి సింహతలాటరాయఁ డితఁడు

1. A. B. అరికల్కి
2. ,, మహీశ
3. The second line of the verse is omitted in A.
4. The third and fourth lines are transposed in B.
5. A. B. చిత్తేశ
6. A. భేదికులంబు
7. A. B. ధీరు
8. ,, రాజేశులను
9. ,, తెచ్చినవని

తోడరి పాతాళంబు । దూఱినఁ బోనీఁడు
రంజిల్లు ధరణీవ । రాహుఁ డితఁడు[1]
పరికించి యటు మిన్ను । ప్రాఁకినఁ బోనీడు
దట్టించు[2] మన్నెమా । ర్తాండుఁ డితఁడు
జూణిఁగి[3] యంభోరాశిఁ । జొచ్చినఁ బోనీఁడు
చటులశాత్రవమీన । జాలుఁ డితఁడు
తలఁప నిఁక నేది విధమని । పలుకుకొనుచు
విఱిగి పఱతురు భవదరుల్ । వివిధముగను
నాహవంబున నీవు వెన్నాడినపుడు
రణజయవిహారి వెలుగోటి । రాయశౌరి. 375

సీ. పటుహర్మ్యటులచేతఁ । బగతుల గుండియల్
పగిలింతు[4] కరవాల । భైరవాంక
శరణాగతాహిత । క్ష్మామండలేశుల
రక్షింతు సంగడి । రక్షపాల
దిగ్దేశవిశ్రాంత । ధృతిఁ దనముఖ్యుల[5]
లాలింతు సింహత । లాటరాయ
శేషవాల్మీకరచిత విశేషవిలాస
మాలింతు[6] రాజవే । శ్యాభుజంగ
మన్నెమాత్రుఁడవే [నీవు] । మానినీని
కాయమకరాంక ఖడ్గనా । రాయణాంక[7]
విమతసంహార వేంకట । విభుకుమార
రమ్యకులదీప వెలుగోటి । రాయభూప. 376

---

1. A. రవళిసింహతలాటరాయడితఁడు
2. A. B. ఘట్టించు
3. A. జూగిగి
4. A. B. గవించు
5. ,, దృతన (ధృతన) ముఖ్యాలీల
6. A. శేషవాల్మీకాది చిద్విశేషవిలాలచతురోక్తి
   B. శేషవాల్మీకాదిచిత । విశేషవిలాసచతురోక్తి
7. A. మన్యమాత్రుండె &. c. B. కన్యమాత్రుండె మానినీనికాయమానమకరాంక ఖడ్గనారాయణాంక

శా. నీటుం జోటు మెఱంచు[1] శూరులకు గుండెల్ వ్రక్కలై తూలు నీ
ధాటీతమ్మటధంధణంధణల నుద్భాసించు నీతో నిరా
ఘాటాహంకృతిఁ[2] బోర నొక్కనికి శక్యంబా రణాభీలబా
హాటోపాధిప[3] వేంకటప్రభునిరాయా వీరకంఠీరవా. 377

*సీ. అతిగాఢపరిరంభణాసక్తిఁ గదిసినఁ
గౌఁగిటి కెద[4]యీఁడు కమఠభర్త
కోరి చుంబించఁ బైకొన[5] మోవిపైఁ గేలు
దిగువఁ[6] జాలకయుండు దిగ్గజములు
మనసు రంజిల్ల డాకొని పాదపద్మంబు
లొత్తఁ జూడంగనీఁ డురగవిభుఁడు[7]
పలుకుసందడిఁ బల్కఁ బల్కించుకొన నోఁడు
సరసనర్మోక్తుల శైలరాజు

సమరసులుగాని యీమూఢతముల పాలఁ
బడఁగ నేమిటి కని ధరాప్రౌఢకాంత
వలచి వచ్చిన బహుళకళా వైభవములఁ
బ్రౌఢిఁ బాలించు రాయభూపాలమౌళి. 378

క. హితమతి నారాయమహీ
పతిరత్నము రాగమాంబఁ బరిణయ మయ్యెన్
రతిదేవిఁ బంచబాణుఁడు
సతుల(శ్రీ) లక్ష్మి నంబుజాక్షుఁడు బోలెన్. 379

---

1. A. B. బోటమెఱించు
2. ,, నుద్యత్నించు నీతోనిరా ఘాటాలంకృతి
3. ,, బాహాటోపాధిప
4. ,, కడ
5. ,, చుంబించు బైకొని
6. ,, తెగువ
7. ,, రంగవిభుఁడు

సీ. అంబుజంబు ధరించు నల కైటభారాతి
యంబుజంబును మెట్టు నబ్ధికన్య[1]
శమదమాదులఁ జూడ నమరు శంకరయోగి
చండికాహ్వయ మందు శైలతనయ
సిద్ధసత్త్వమున రాజిలుఁ గూర్మకులమౌళి
రాజసం బూను ధరాపురంధ్రి
వేల్పుఁ బుట్టువుఁ దాల్చి వెలయు నద్రివిభేది
యసురజన్మముఁ గాంచు హరివధూటి
అరయ నిటువంటి సహధర్మ చరులు గలిగి
రౌర యని రాయభూపనాయకహితైక
ధర్మశీలానుకూలవర్తనల మెఱయు
రమ్యవిలసత్కృపాలంబ రాగమాంబ. 380

*క. ఆరాగమాంబ వలనఁ గు
మారమణులఁ గనియె రాయమనుజేంద్రవిభుం
డారూఢకీర్తి రంగ
క్ష్మారమణుఁ గుమారరంగ మహిపతిచంద్రున్. 381

*వ. అం దగ్రజుండు. 382

*సీ. ఖ్యాతిప్రతాపాబ్ధి గరిమచే నెఱిఁగించు
నుభయకావేరిమహోన్మహేల[2]
నానాప్రకారసే నాజాలములఁ దెల్పు[3]
సప్తావరణ[4]చక్ర సహితలీల
శరణాగతారాతి సరణిచేఁ బ్రకటించు
ధర విభీషణసేవితక్రమంబు
ధీరవైష్ణవసమృద్ధినిఁ జాల వెలయించు
నిత్యసూరికదంబ నియమవృత్తి

1. A. B. మెట్టునట్టికన్య
2. A. మహేర్విఖేల B. మహాద్విబేల
8. A. B. దెల్చు
4. A. సప్తారణి

బహుళనృపదత్త[1]మహితసంపదలఁ జూపు
నందపద్మమకరముఖ[2]నవనిధులను
రమ్యపరిమళకస్తూరి రంగఁడైన
రాయభూపతిరంగభూనాయకుండు. 383

*క. హరిబలుఁడగు నతనిసహో
దరుఁడైన కుమారరంగధాత్రీశ్వరుఁ డు
ర్వరఁ గీర్తి[3] గని మించున్
వరహరిపదభక్తివైభవప్రథుఁ డనఁగన్. 384

క. [4]ఆచతురున కనుజన్ముఁడు
ధీచాతుర్యాతివిభవ[5]దేవగురుండై
భూచరఖేచరు లెంచఁగ
నేచక్షితినాథచంద్రుఁ డేలు ధరిత్రిన్. 385

వ. ఆయేచమనేని వంశావతారం బెట్టి దనిన. 386

క. అలయేచఘనునిపుత్రులు
విలసిలుఁ గస్తూరిరంగవీరాగ్రణియున్
బలయుతుఁడు తిమ్మవిభుఁడును[6]
హలపాణియు శార్ఙ్గధరుఁడు ననమించి[7] రిలన్. 387

ఉ. ఈశసదృక్షభూతినిధి యేచయరంగవిభుండు బాహుళ
గ్దాశని గోలకొండ యవనాచలపంక్తిని గూల్చు[8] నార్పు గ
ర్జాశతమై వినంబడఁగ జండనిశాచరహంత[9] క్రొత్తలం
కాశివసాక్షిగా ముగురుగంగలుసాక్షిగఁ గోటసాక్షిగన్. 388

---

1. A. B. దంత
2. ,, నలహారిశ్చంద్రముఖనిత
   నవనిధులలో నందస్థానమున 'కుంద' అనికొందఱు. నందపాఠమే సుప్రసిద్ధము
3. ,, కీర్తుల
4. This stanza comes after 336 in the Mss.
5. ,, చాతుర్యాభివిజిత
6. ,, వెలశిరి రంగక్షితిపతివీరప్రతాప । బలశౌర్యుండు తిమ్మవిభుండు ।
7. ,, హలపాణిశార్ఙ్గధరులనంగా
8. ,, గెల్చి
9. ,, హంతి

ఉ. బల్లరగండగోచనర పాలకనందన రంగధారుణీ
వల్లభ నీప్రతాప మెటువంటిదొ కాని భవత్తురంగముల్[1]
బల్లనఁగట్టఁ బంపఁ బర పట్టణభూపులు[2] చిందువందులై
తల్లడమంది పాఱి నిజధాటికి మాటికిఁ జెప్పనేటికిన్. 389

సీ. పూని నీపాదాలపై నాన వెట్టితే
భయమంది పాఱెడు పాము నిల్చుఁ
బరరాష్ట్రములు నీప్రభావంబుఁ[3] జెప్పితేఁ
బసిబిడ్డ వెఱచును బాలుఁ ద్రావ
నీదండయాత్ర వింటే దిశల్ దప్పి యి
ట్టట్టను మూఁడుసింహాసనములు
హిమసేతుపర్యంత మీభూమి నీయాజ్ఞఁ
దుద్రివేలుఁ జూపితేఁ ద్రుళ్లిపడును
నీకు నీవు సమానంబు గాక యొరులు
సాటియే ధాత్రిపై వెలుగోటియేచ
విభుకుమార పదానమద్విధవిమత
వీరవేశ్యాభుజంగ కస్తూరిరంగ. 390

సీ. ఆలోలకీలాకరాగ్రమై దావాగ్ని
ఘోరాటవుల ముట్టుకొన్న యట్లు
చిత్రభ్రమణ లెగసిల్ల[4] మంథానాద్రి
కలశాబ్ధి నురవడిఁ గలఁచినట్లు
విలయకాలాభీల[5] విపరీతవాయువు
ధారాధరంబులఁ దఱిమినట్లు
గంభీరనిర్ఘోషకంఠీరవము రేఁగి
హరిణవర్గము గంతు లడఁచినట్లు
నీవు రణమండలంబున నిలిచి వీర
కేళిఁ జూపినఁ బరమహీపాలబలము

1. A. B. భవత్తురంగముకు
2. A. వల్లనకట్టివన్క—పరపట్టణభూములు B. వల్లనకట్టివెన్క—పరపట్టణభూములు
3. A. B. ప్రతాపంబు
4. A. లెగశిల B. వెలశిల
5. A. B. ప్రళయకాలాభీల

సమయుఁ జీకాకువడుఁ బాఱు । జలదరించు
వీర కస్తూరిరంగ సాహసతరంగ. 391

సీ. కొండవీడాది వినుకొండ[1] మన్నీలను
గొట్టవా కొచ్చెర్ల । కోటఁ జేర
రాయమన్నీల నిరువది[2] యాఱువేలను
దునుమాడవా క్రొత్తకనుమలోన[3]
రాయల కొడైన[4] । రసికతమ్మపగాని
కప్పనుందవె యొక్క । గడియలోనఁ
బంద్రెండువేలకాల్బలముతోఁ వచ్చినఁ
దెగటార్పవా మల్ల । తిమ్మఘనునిఁ
గోనవంకర్ల[5] చల్లలకూనపులులఁ
దాసరేంద్రునితిమ్మనిఁ । దఱిమి తఱిమి
జయముఁ జేకొన్న వెలుగోటి । సార్వభౌమ
విమతమదభంగ యేచభూవిభునిరంగ. 392

శా. ఈక్షోణిన్ శశిముఖ్యరాజకులముల్ । హింసించి తద్రక్తముల్
సాక్షాద్రాముఁడు రెండుమూఁడుమడుపుల్ । గావించె నేఁడొండు ప్ర
త్యక్షించెన్[6] వెలుగోటిరంగఁడు దురబాహాహేతిఁ గోటూరిసీ
రక్షేత్రంబున రాచపించ మఱుఁచెన్ । రక్తప్రవాహంబుగన్. 3?3

ఉ. అట్టిటుఁ బోవనీక విజయాద్భుతవిక్రమవిక్రమార్కుఁడై
తిట్టుతె కుట్టినట్లొరయు[7] । దిట్టల పోట్లల సంగరస్థలిన్
దెట్టలు గట్టఁ గూల్చి రణధీరుఁ డొకం డిఁకఁ[8] గల్గనేర్చునే
రట్టడి యేచభూవిభునిరంగఁడె కాక వసుంధరాస్థలిన్. 394

---

1. A. B. వినికొండ
2. ,, యిరువది
8. ,, నురుమాడకొత్తకన(ను)మలోన
4. ,, రాయలకువొడైన
5. A. గొనవంకరచల్లల B. గొనవంకరీచల్లల
6. A. B. ప్రత్యక్షించి
7. A. తిట్టుతెగుడ్డినట్లొరయ B. తిట్టితెగుడ్డినట్లారయు
8. A. B. ధీరుండొకండిక

శా. పట్టాధీశులు నొచ్చి వచ్చినను జేసెపట్టక విరోధించి యి
ట్టట్టన్నంతనె మట్టుపెట్టె ససహాయుండైన శౌర్యస్థితిన్
బట్టా యా[1] వెలుగోటి యేచవిభుకుం బట్టైనరంగప్పఁడో
బట్టా వానిప్రతిజ్ఞ లే దనఁడు తా ప్రత్యర్థికి న్నర్థికిన్.[2] 395

మ. అరుదా నీబిరుదప్రబంధములు[3] గల్యాణాద్రిపై యక్ష[4]కి
న్నరగంధర్వసతుల్ సదాశ్రుతిపుటానందంబుగాఁ బాడఁగా
నర రే! బాపు! భళీ! సెబా! సహహా! యౌరా! మేలహో! యంచురా
హారిదీశుల్[5] వెలుగోటియేచవిభురంగా సంగరక్ష్మాభుజా. 396

సీ. కిల్లాకు నంపితే ఢిల్లీకటకగౌళ
మేదినీశుల నామ జాగ[6] వచ్చు
నీలిపోఁ గంపితే[7] నేపాలముండువా
పండువానృపతుల పంపు వచ్చు
ముఖవార్తఁ బంపితే[8] ములువాయకోలాల
మలయాల భూముల మంది వచ్చుఁ
జీటిఁ బెట్టంపితే సింధుకేరళచోళ[9]
పాండ్యరాజుల యంగ బలము వచ్చుఁ
దముకు వేయించితే దిగంతముల[10]నున్న
రాయమన్నీలు వత్తురు రేకురాయి బడిగ
భూవిభునిమాత్రుఁడే మనుష్యావతార
రంగవిభుఁ డుర్వి వెలుగోటిరంగవిభుఁడు. 397

---

1. A. B. బట్టయా
2. ,, ప్రత్యర్థికిన్ అర్థికిన్
3. V. P. Sastri (C.m.m.i.p. 59) ప్రతాపములు
4. ,, నుండి
5. A. B. అరిధీశుల్ ; V. P. Sastri (C.m.m.i.p.59) రాయ్యారిపీరుల్
6. ,, నామజాజు
7. ,, నూలిపోగంపితె
8. ,, (వ)దిప్పితె
9. B. కేరళగూడ
10. A. B. తముకు వేయించితే దిగంతములనున్న

సీ. జైత్రయాత్రాసము జ్జయదభేరీభూరి[1]
ధణధణధ్వనిచేత దద్దరిల్లి
ధాటీనిరాఘాట ఘోటికా[2]ఖురసము
ద్ధూతధూళీపాళి[3] చేతబెగడి
మదగంధలోలుప మధుకరోన్మాదిత
కలభఘీంకృతులచేఁ గలువరించి[4]
వరధనుర్ధరజయా వష్టంభరణ[5]ధను
ష్టంకారములచేతఁ జాలఁ బ్రమసి
తిరిగి చూడక వివిధది గ్దేశములకు
నాత్మజాయాసమాకృష్ట హస్తు లగుచుఁ
బరువులెత్తిరి శత్రుతా ధరణిపతులు
సంగరాటోప వెలుగోటిరంగభూప. 398

వ. అతనియనుజుండు. 399

ఉ. వ్యాలవిభుండు ధీమహిమ నప్రతిమప్రతిగండభైరవా
భీలపరాక్రమాఢ్యుఁడు గభీరగుణాభరణుండు గాయగో
వాళజయాంక[6]శౌరి యతి వైభవుఁ డవ్వెలుగోటియేచభూ
పాలకుతిమ్మశౌరి రణపార్థుఁడు పార్థివమాత్రుఁడే భువిన్. 400

గీ. ఆకెపిటితిమ్మభూకాంతునకు నగ్ర
జాతుఁడైన రంగజనవిభుండు
తగ వివాహమయ్యె దామెరవెంగళో
ర్వీకళత్రు[7]పుత్రి వేంకటాంబ. 401

---

1. A. B. సముజ్జయనభేరిభూరి
2. ,, ఘోటి
3. ,, సముధూతధూరిపాలి
4. A. B. మదగంధలుబ్ధఘుటభటత్క్రారి(ఖే)ఖేంద్రియలచేత కలువరించె
5. ,, గణ
6. A. గో । వామజయాంక
7. A. వెంగళో క్వాకలత్రు

వ. ఆసాధ్వీరత్నంబునందు కందర్పనిభుఁ గుమారరంగవిభుని ధాటికా ఘోటి
కాఖురశిఖరచూర్ణితదిగంతు నేచభూకాంతు గీతికాసాహితీకారసవిశాలు
సింగభూపాలుఁ గాంచె సమ్మ్రుప్వరు[1] భువనత్రయంబు కరణి హరిహరహి
రణ్యగర్భుల సరణి ప్రసిద్ధిఁ గని రం దగ్రజుండు. 402

ఉ. ప్రేమఁ గుమారరంగమహీభృన్మణి దానకళావిలాస మి
చ్ఛాపతి[2] నభ్యసింప నొకచక్కి వసించి గ్రహింపలేవ చిం
తామణి కామధేనువిబుధద్రుమముల్ దమఁ జూడఁ బ్రస్తర
గ్రామపశుప్రగవర్గములుగా వె మహాగుణముల్ లభించు నే.[3] 403

సీ. తేజఃక్షమాభోగధీరూపములయందు
శ్రీధరేంద్రాత్మభూస్థేమఁ దనరి
నయకాంతిబలశీల[4]నరనాథజయములం
గురురాజబలహరి సరణిఁ దాల్చి
హరిభక్తిగరిమదాన[రుచిసంపద]లందు
గిరిజేశ ఘనమిత్రనిరతిఁ బూని[5]
చటుల ధృతిస్థైర్యసౌజన్యకృపలందు
పవిధరారామ ప్రముపటిమ నెనసి[6]
వెలసె ఘనశరకులదృఢదళనకలన
వల సయోడ్యాన తరవారి పటువిహారి
సరస వెలుగోటికులవార్ధి జలరుహారి
రసికభయహారి రంగయ రంగశౌరి. 404

వ. అతని యనుజుండు. 405

సీ. కందనోలును గుత్తి గండికోటయుఁ జొస్తి
నీతితో లోభిమన్నీలమిండ
గోలకొండయు మట్టి కొండవీడును జొస్తి
కరమర్థి బల్లరగండబిరుద

1. A. నమ్మాప్పురు B. మ్రుప్పురు
2. B. మిచ్ఛామతి
3. A. వెలయుందపెరిగ్ లంధించు నే B. వెలయందపిరిగ్ లభించు నే
4. A. B. బల(శ)కలా
5. ,, హరిభక్తి గరిమదానములందు గిరిజేశఘనమిత్రనియతిబూను
6. ,, చట్టులధృతితార్కుసాజన్యకృపలయందు వివిధభోజనకపటిమనెనశి

ఉదయాద్రి నెల్లూరు । నోరుగల్లును[1] జొస్తి
పరు లెన్న సంగ్రామ । పరశురామ
కటకము ఢిల్లియుఁ । గాశికాపురిఁ జొస్తి
తాల్మితో రిపుగజ । దళవిభాళ
ఎలమి నీతోడ డీకొన । నెవ్వఁడోపు[2]
భావజాకార విక్రమార్కావతార
వరగుణాధార[3] రంగభూవరకుమార
ప్రాభవోపేంద్ర యేచభూపాలచంద్ర. 406

వ. అతని యనుజుండు. 407

సీ. మత్తారిరాజన్య । మస్తకంబులఁ గాని
పూజసేయఁడు యుద్ధ । భూతలంబు
రాపాడు శత్రుల । రక్తధారనె కాని
యోలలార్పఁడు భూత । జాలములను[4]
మలయు విరోధుల । మాంసంబులే కాని
మేఁత వెట్టఁడు కాల । మృత్యువునకుఁ
గపటారి[5] కాంతల । కంటినీరునఁ గాని
కడుఁగ నొల్లఁడు చేతి । ఖడ్గధార
నార! సాహసగుణవిక్ర । మార్కనిభుఁడు
మన్నెగజసింహుఁ డభియాతి । మన్నెమాన్ప
సమరవిజయుండు వెలుగోటి । శాసనుండు
చిత్రజనిభుండు రంగయ । సింగఘనుఁడు. 408

ఉ. భంగనవీనఫేనఫణిభర్త ధురంధరదుగ్ధవారిరా
శిం గని హంసశుభ్రసరసిం గని శైలకుమారికావిలా
సిం గని లాంగలస్ఫురదసిం గని కల్పవటీరరాట్ప్రలా
శిం గని[6] నవ్వు రంగవిభుసింగనికీర్తి మనోహరద్యుతిన్. 409

---

1. A. B. వోరుగల్లును
2. B. Stops with యెలమినీతో
3. A. వరజూనాదార
4. B. రాపాడు శత్రులరక్తధారలె కానివర్లండు భూతజాలమునకు
5. A. B. కవటుని.
6. ,, కృత్తిపటీరరాహావాశింగని

వ. సంతతికి యేచమనేఁడు మొదలు. 410

ఉ. రంగయయేచశౌరి రణ।రంగధనంజయుఁ డుద్ధతారి[1]సా
రంగమృగేంద్రుఁ డర్థిజన।రక్షణదక్షవితీర్ణి[2] బంధుసా
రంగపయోధరంబు రతి।రాజమనోహరమూర్తి పూర్ణసా
రంగధరాభకీర్తి సుగు।ణాభరణుండు నృపాలమాత్రుఁడే. 411

[3]సీ. సింహాసనమునకుఁ । జిత్తంబులో నొండు[4]
దలఁచు ద్రోహుల తొమ్ముఁ । దన్నినాఁడు
మదిలోనఁ గ్రొవ్వి ధ।ర్మ నకార్య మూహించు
చెనఁటుల జిహ్వలు । చీల్చినాఁడు
మొనలు తారసమైనఁ । గని స్మయంబున[5] వీఁగు
చండిమన్నెలవెన్నుఁ[6] । జఱచినాఁడు
ఎదిరించు మన్నీల । నేపునఁ బడి పుట్ట
చెండ్లు గొట్టినరీతిఁ । జెండినాఁడు
మన్నెమాత్రుండె యితఁ డరి।మర్మభేది
మన్నెబెబ్బులి గడిమన్నె । మగలమగఁడు
సమరగాండీవి వెలుగోటి । శాసనుండు
రంగభూపతి యేచధ।రావిభుండు. 412

సీ. నేఁడుగా తలపూలు । వాడకెంతయుఁ[7] జాల
నలరెను బద్మనా।యకకులంబు
నేఁడుగా భువనవ।ర్ణితమహాభూతితోఁ[8]
గొమరొందె రేచర్ల।గోత్రమెల్ల

---

1. A. B. ధనంజయుఁడు ధతారి
2. ,, దక్షులతీర్ని
3. A. The scribe has by mistake copied at the beginning of this verse the first line of కందసోలును గుత్తి; and this has been repeated in B.
4. A. B. రెండు
5. A. భరంబున; B. భయంబున
6. A. B. రొమ్ము
7. ,, వాడకంతయును
8. ,, మహాద్భుతతోడ

నేఁడుగా భువియందు[1] నెగడె సర్వజ్ఞసిం
గమనేని[2] సంతాన గౌరవంబు
నేఁడుగా మదిఁగల్గు నెవ్వ లన్నియుఁ[3] దీఱి
విలసిల్లె ఘనమైన వెలమపేరు
నీవు కర్ణాటకంబున నిలిచినపుడ
రాయవిద్వేష గర్వదుర్వారవైరి
కోటిఁ బరిమార్చి గెల్పుఁ జేకొనినకతన
హితమతాలాప వెలుగోటి యేచభూప. 413

సీ. దళవాయికిని వెట్టిగొలిపి వచ్చిన వాని[4]
పట్టంబు గట్టుకొన్నట్టినాఁడె
గుమిగూడి వేలూరికోటలోఁ గల యాలె
యాబుళేశునిఁ[5] ద్రుంచి నట్టినాఁడె
నిండారమగు[6] రాయభండార మెల్లను
నాక్రమణము[7] సేసినట్టినాఁడె
పుత్రమిత్త్రకళత్రపుంజంబు రాయల
నరయక[8] వధియించి నట్టినాఁడె
చచ్చె నీచేత గొబ్బూరి జగ్గరాజు
పాఱిపోఁబట్టె రెండేండ్లు బ్రదికెఁ గాక
లలితచారిత్ర వెలుగోటి కులపవిత్ర
హితమతాలాప రంగయయేచభూప. 414

సీ. నీహేతిచే జగ్గనృపతి సద్గతిఁ బొంది
పాపాత్ముఁడను[9] నిందఁ బాపుకొనియె

---

1. A. B. భరియించి
2. ,, సింగభూజాని
3. ,, నవతలన్నియు
4. A. దళువాయకుని వెట్టి గొడ్వింపెడు వానిపట్టంబు
5. A. B. వాబిళేశుని
6. ,, నిండారమైన
7. ,, నాక్రమ్యముగ
8. ,, పుంజమ్ములను రాయలరోయక
9. ,, ప్రాళ్ళలన

విజిగి వీరవిభుండు ఽ చిరుతనాపలిఁ జేరి
దిడ్డి[1]తూరుపుదిక్కుఁ ఽ దెఱవ వెఱచెఁ
దనప్రాణములు దాఁచు ఽ కొని చెంజికృష్ణప్ప
వీఁగి యెన్నఁడుఁ గోట ఽ వెళ్ల వెఱచె
నమ్మినదొర లటు ఽ నట్టేటఁ[2] బడిపోవ
గోటకాఁ డొక్కండు ఽ గూటఁ బడియె
శాకమూరులు రావెలల్[3] ఽ మాకరాజు[4]
వారు దిక్కుమొగంబులై ఽ నారు[5] జడిసి
ఔర ! తోపూరుపాళెంబు ఽ లదుర నీవు[6]
త్రోచి నడిచిన వెలుగోటి ఽ యేచభూప. 415

సీ. రాజులలో జగ్గ ఽ రా జనిమోనఁ బడెఁ[7]
దప్పెఁ గార్యంబు వీ ఽ రప్ప నేఁడ
పదపద చిరుతనా ఽ పలి చేరఁ గావలె
మాకరాజు గుఱాని ఽ నూకె మొదల
ఏనుఁగు నెక్కుట ఽ మానుక దళవాయి
తా ఱెను దనదు బి ఽ డారిబైట[8]
రావెల వెంకన ఽ తా వెళ్లసాగెను
పోయి మున్నుగ దెరు ఽ వీయనొక్కఁ[9]
డనుచుఁ గృష్ణపనేఁడు ము ఽ న్నాడి తెలుప
జాఱు వీరపనేఁడు నీ ఽ బారుఁ[10] జూచి
వైభవబిడౌజ రంగభూ ఽ వరతనూజ
హిమకరాకార వెలుగోటి ఽ యేచభూప. 416

---

1. A. B. దిండు
2. A. నట్టుట
3. A. వెలమూరు
4. B. మారరాజు
5. A. దిక్కుమొకంబులైనారు ; B. తిక్కుమొకంబులైనారు
6. A. B. ఔర నీవు తోపూరుపాళెంబులదుర
7. A. B. మోనఁబడేను
8. ,, ఏనుఁగునెక్కెది మనకురాదుసుమీ చావేనుమనదు బిడారిబైట
9. ,, పోయిమున్నుగదరు వాయువొకండు
10. A. నీజారు

సీ. వారజీతమొకాని | బారునా కేలని[1]
చినరాతు మొనలకుఁ | జేర వెఱచు
నూడిగమే కాని | కూడ పీపను లని
యెప్పుడో జరిగె నా | తిప్పరాతు
మఱియు మంతేఁగాని[2] | మా కిది కాదని
గుట్టుగాఁ దిత్తెప | సెట్టి[3] కదలెఁ
బాళిగాఁ డైతాను[4] | బ్రదికేది లెస్సని
చిట్టాడ కదలె నా | గట్టి మొదలి[5]
మఱియు నక్కిరి[6] దొర లిటు | మార్గమున నె
వట్టి మూఁకలు నీమీఁదఁ | నెట్టుకొనునె
వైభవబిడౌజ రంగభూ | వరతనూజ
హిమకరాకార వెలుగోటి | యేచధీర. 417

సీ. పాఠక[7] సుకవీంద్ర | బంధువిద్వజ్జనా
శ్రయమూలమైన[8] | గోచర్ల పేరు
పరిపంథిరాజన్య | పట్టణోద్ధత[9] వీర
రణజయార్జితమైన[10] | రావు పేరు
సకలదిగ్భూముల | జనులు సన్నుతి సేయఁ
గరమొప్ప గని యేలఁ | గనిన పేరు
విక్రమక్రమకళా[11] | విఖ్యాతమహిమలఁ
గోరి తెచ్చిన వెలు | గోటి పేరు

---

1. A. యెమరజాతికాని బామనా రేలని
   B. ,, బారునారులని
2. A. B. మ్మెతేగాని
3. ,, తాతితపశ్శెట్టి
4. ,, పాళిగాడెండైన
5. A. చిట్టిడికదిలెనా మోదలి B. ...మోదరి
6. A. B. దక్కిన
7. ,, పాఢక
8. ,, ధారములలైన
9. A. పట్టకోహాత
10. A. B. జయార్థితమైన
11. ,, కతా

నీకు ముత్యాలపేరులై నిలిచె నార
మత్తరిపుమస్తవిన్యస్త మణికిరీట
సురుచిదీప్తపదాంక[1] కస్తూరిరంగ
విభునిసత్పుత్ర యేచపృథ్వీకళత్ర. 418

ఉ. గొబ్బురి జగ్గరాజు లోకకోటి మ తేఁబదికోట్లు మాకరా
జబ్బలు నూఱు కోట్లపయినాఱ్వురు[2] రావెల వెంకులైన హ
న్నిబ్బరగండఁ[3] డేచధరణీశ్వరు ముందఱ నిల్వశక్యమే
గబ్బులు గాక బెబ్బులిముఖాముఖి మేఁకలు నిల్వ శక్యమే. 419

ఉ. కబ్బిని నుండు నీతరము గాదు రణస్థలి మాకరాజ నీ
గబ్బితనంబు మాను మవకార్యము రావెల వేంకటాద్రి యో
గొబ్బురి జగ్గరాజ మనకుం దగ దీపగ యేచశౌరితో
బెబ్బులి డాసి మచ్చరముఁ బేర్చుఁగఁ జింకల[4] కోర్వవచ్చునే. 420

ఉ. ముప్పదివేలు వీరభటముఖ్యులు దావులపాపశౌరితో
ముప్పది యంచు మించి గడు[5] మూర్ఖతఁ జేరిన రెండువేలతోఁ
జొప్పడ నిల్చి తీపు[6] [రణ] శూరత నీప్రతిమన్నవాఁడు లే
డప్పు భళీరె[7] రంగవసుధాధిపుయేచనృపాలశేఖరా. 421

సీ. త్రొక్కించు గడిమన్నెదుర్గముల్ హయముచే
దిగదిగమని పెల్ల తెగయుచుండ
దరికొనఁజేయు నుద్దండవిరోధిరా
ణ్ణికరపట్టణవహ్ని నింగి కెగయఁ
దలలు చక్కాడుఁ బ్రత్యర్థిరాజకుమార
వర్గంబు దోర్గర్వ వైఖరెసఁగఁ[8]
బట్టించుఁ జెఱఁ బెట్టి దట్టించి రిపురాజ
కోటిని మిక్కిలి నీటుఁ జూపఁ

---

1. A. B. చారుకీర్తి
2. B. Stops with మాకరా. The sources of Vijayanagara History (P. 308) లకుమీద బదియార్గురు
3. B. మానిబ్బరగండ
4. A. B. చేర్చుక చింన్నల
5. ,, మించినడు
6. ,, జొప్పడనిల్చితివి
7. B. ఠఠ
8. A. B. రాజన్యకుమారవర్గముల్ దోర్గర్వవైఖరులను

గాచు శరణన్నవారినిఁ బ్రోచుఁ దనదు
దండఁ జేరిన యరిరాజ మండలమును
మండలంబున రంగభూమండలేంద్రు
యాచభూపాలశౌరి దయావిహారి. 422

సీ. పాటువేఁటలు రాచబారు లెల్లను నీకు
పట్టుగొట్టెలు గదా పగఱ కరులు[1]
వీటితోఁటలు గదా మేటైన కోటలు
కాకు లాతాణేల నూఁకలెల్ల
పన్నన్ను లామన్న పాళెల సొమ్ములు
నమ్మిన కాఁపు లా కమ్మదొరలు
పెండ్లిండ్లు గా నీకు భీకరకదనముల్
ప్రతిన గదా రామరాయపట్ట
మౌర ముగురు దునేదారు లయిన [నిన్ను]
నెదుర లేరన[2] యతిరాజు లెదురఁగలఁడె
బాంధవుల నన్నదమ్ములఁ బాసి చనియెఁ
బరహితాచార వెలుగోటి పురవిహార
రంగధాత్రీశు నేచధరాతలేంద్ర. 423

మ. బెగడెన్ గర్నలి సత్యవీడు వడిఁ గంపించెన్ బళాపంచలై
పగలం బాఱెను జెంజి మించి మధురాపర్యంతరాష్ట్రంబులన్
దిగులెత్తెన్ గడిదుర్గముల్ వణఁకె భీతిం జగ్గరాజాదిరా
చగముల్ రంగయయేచశౌరి కెదిరించం లేక పాఱాడఁగన్.[3] 424

వ. అతని కుమారుండు. 425

మ. దళితారాతినికాయ నీ గెలుపు వింతా యెంత నీతండ్రిచేఁ
గలనన్ నెగ్గని రాజులున్ బిరుసువక్కల్[4] గాని దుర్గాధిపుల్

1. B. కుదులు
2. A. B. యెదురజాలరు మోదటి
3. A. పాఱెండుగన్
4. ,, వక్కల్

కలయన్[1] గొల్వని మన్నవారుఁ గలరే కర్ణాటభూమండలిన్
వెలుగోటిచమనేనియేచనృపతీ వీరప్రతాపోన్నతీ. 426

సీ. శరణు కాకితరాజ్యసంస్థాపనాచార్య[2]
పాలించు గాయగోవాళబిరుద
మన్నించు పరిపంథిమన్నెకాలాంతక[3]
రక్షించు ఖడ్గనారాయణాంక
ప్రాణదానము సేయు ప్రతిగండభైరవ
కావు మాశ్రితజనకల్పభూజ
కరుణించు వైభవాఖండలసంకాశ
కృపఁ జూడు రేచర్లకులపవిత్ర[4]
యనుచుఁ బ్రత్యర్థివరులు నీయడుగుఁదమ్ము[5]
లాశ్రయింతురు వినతులై యనుదినంబు
సమరనిశ్శంక వెలుగోటిశాసనాంక
రణజయోత్సంగ యేచభూరమణురంగ. 427

వ. అతనికుమారుండు. 428

శా. దిట్టైనట్టి కుమారయేచవసుధాధీశప్రభానాథ నీ
పట్టం బాహవభూమి శాత్రవమహీపాలాగ్రకంఠంబులన్
గొట్టన్ బెట్టను మట్ట మెట్ట రిపులం గ్రోధించి తద్దేహముల్
దట్టించున్ విదళించుఁ జించును మహోదగ్రప్రతాపంబునన్. 429

సీ. నలజయంతవసంతనలకూబరుల చెల్వు
సాధించు నెవ్వాని చక్కఁదనము
సురధేను సితభాను హరిసూనుల వితీర్ణిఁ[6]
దలఁపించు నెవ్వాని దానమహిమ

---

1. A. B. కలిత
2. ,, భరణు కాకిత రాజురాజ్యస్థాపనాచార్య
3. ,, కాలాంతర
4. ఇచ్చట కవి 'ఋ, ఉ' లకు యతిమైత్రిని గల్పించెను
5. ,, నీయడుగుదలాశ్రయింత్తు
6. V. V. C. చాగంబు

గుహాధనంజయభీష్మ గురుభుజాబలశక్తి
శాసించు[1] నెవ్వాని శౌర్యగరిమ
శరదభ్రకనదభ్ర కరిసితాభ్రద్యుతి
గర్హించు[2] నెవ్వాని ఘనయశంబు
చండతరవైరిరాజన్య కాండగంధ
సింధురచ్ఛేదనోదగ్ర సింహ మతఁడు[3]
మేటిమన్నీఁడు[4] మా వెలుగోటిరాయఁ
డేచభూపాలునికుమార యేచఘనుఁడు. 430

సీ. నీభేరిభాంకృతు ల్విండి వీనులఁ బర్వ
నుల్లంబు జల్లనఁ దల్లడిల్లె
మిఱుమిట్లుగొల్పు నీ మేటిడాల్గనుఁగొన్న
ఘనభయంబున మహాకంప మొందెఁ
గళకళమను నీదు కైజారుఁ[5] జూచినఁ
గడు దప్పి దప్పని కలవరించె
సింగిణి విడివడి[6] రింగు రింగున వచ్చు
నీచే లకోరిల నేటుబెడిసె[7]

బెదరి పఱువెత్తి దగఁ దొట్టి బెగ్గలింపఁ
దఱిమి నఱుకవె[8] మైసూరిదళము నెల్ల
సకలబిరుదాంక వెలుగోటి శాసనాంక
యేచభూపాలునికుమార యేచధీర. 431

---

1. B. శక్తినాశించు
2. ,, గరించు V. V. C. ఘుర్షించు
3. ,, సింహమనఁగ
4. A. మోటిమాన్నీడు
   B. మేటిమాన్నీడు
5. A. B. కైజతము
6. ,, విడివిడి
7. A. నిచెలకారిలం నితివెడశి
   B. నిచెలకారిలంనింతివెడశి
8. A. తరమినకవె B. తరలినకవె

ఉ. స్వామి కుమారయేచ రిపుక్షైత్రధనంజయ[1] నీపరాక్రమం
బే మని చెప్ప[2] మైసురిముఖ్యహింశుబలంబులు దారసిల్లినన్
చామలి[3] సంగరంబుననుజానుగఁ గ్రుంచితి వీర! రెండు మూఁ
డామడ పట్టు నిండు పాలెగనుంతయు[4] పీనుఁగు పెంట లేర్పడన్. 432

సీ. మీఁతాతతండ్రైన । మేటి యేచనృపాలుఁ
డంచిత సత్కీర్తి । మించినాఁడు
రాణించు[5] మీతాత । రంగభూపాలుండు
పెంపైన రాజుల । పెంచ మణఁచె
రాయపట్టము నిల్పి । రహి రిపుఁ జెండాడె[6]
నెంచఁగా మీతండ్రి । యేచఘనుఁడు
మలకమూఁకల నెల్ల । మహి నసాధ్యంబుగాఁ[7]
గరలి పైకొని దిశల్ । గల్చితీవు[8]
పంచపాండ్య[9]విభాళసంప్రాప్తబిరుద
హాటకంబైన సింహతలాటరాయ
పార్థివోత్తమ ప్రతిగండభైరవాంక
యేచభూపాలవిభుకుమా । రేచభూప. 433

వ. అచినతిమ్మానేని వంశావతారం బెట్టి దనిన. 434

క. చినతిమ్మవిభునికూరిమి
తనయులు చెన్నయుఁ దిమ్మధరణీశుఁడుఁ గొం

---

1. A. B. జెయిత్త
2. ,, చెప్పవచ్చు, చప్పవచ్చు
3. ,, The first letter of the line lost, then we have బలి or బరి which does not agree with the prāsa. V. V. C. gives the name of the place of the battle as Chāmali.
4. A. పెట్టనిండివాలమంతయు పినుగ పెంటతిర్వడన్
   B. పెట్టునిండివాలమంతయు కినుగ పెంటతిర్వదనూ
5. A. B. రాశించ్చు
6. ,, రాయపట్టమునిర్వైరహారిపుచెండాడి
7. ,, మెదికిమూకలరెల్లమహీనసాద్యమైన
8. A. కరిలి పెకొను దిశగల్చినావు; B. కరిలివికానుదిశనగల్చినావు
9. A. B. పాండియ

డనరాధిపుఁడును బినకోం
డనయు వెలసి రవని నతిదృఢశ్రీమహిమన్. 435

వ. సంతతికిఁ జెన్నప్పనాయఁడు మొదలు.[1] 436

క. అందునఁ జెన్నప్రభునకుఁ
బొం దమరఁగ మాలెకొండభూపుఁడు పుట్టెన్[2]
అందంబు మీఱ నతఁడునుఁ
గందర్పుఁ గుమారచెన్నఘనునిన్ గనియెన్. 437

ఉ. హల్లకవైరితేజ! యవు నయ్య! భళి! వెలుగోటిచెన్నభూ
వల్లభుమాలెకొండ! నెఱవాదివి నీవె వసుంధరాస్థలిన్
గొల్లలు గాఁగ సత్కవులు గోరిన కోరిక లిత్తు; వాజిలోఁ
గల్లరి శత్రుసంఘముల గర్వము వీడఁగ వ్రేతు వెమ్యేడన్. 438

వ. అతని కుమారుండు. 439

శా. నారీమన్మథ మాలెకొండఘను చేనా నిన్నుతింతున్ పయః
పారావారసముద్భవత్ప్రకటశుంభత్కుంభిరాట్ఘంటికా
ధారాళధ్వనిఘుంఘుమత్ఘుమితవాగ్ధారా[3]సుధామాధురీ
పూరంబుల్ దుముకాడు నట్లుగ నహోహో పుంఖానుపుంఖంబుగన్. 440

చ. చలమున దాడిగా వెడలి చండవిరోధుల నుగ్గు నూచగాఁ
గలనను వ్రేయ నర్థులకుఁ గర్ణుని వైఖరి నర్థ మియ్యగాఁ
గలిగిన రాజె యీఘనుఁడు కారణజన్ముఁడు భట్ట యెంచరా
వెలుగోటిమాలెకొండపృథివీపతిచెన్నని రాయరాణువన్. 441

క. [4]వారలలోఁ బెదకోండ
క్ష్మారమణుని కీర్తిహంసిక నిజాండగతిన్
నీరజభవాండమండలి
నారా! తన కుక్షియందె యలముకయుండెన్. 442

---

1. This short prose pass age is found after 437 in the Mss.
2. A. B. భూవరుడు పుట్టెన్
3. ,, ధారాళధ్వమిఘుమితవాగ్ధారా
4. This stanza occurs before 437 in the Mss.

వ. ఆపెదకొండప్పపద్యాలు. 443

ఉ. నీతరవారి శత్రుధరణీపతి[1] దేహ వపారసంబునన్
జాతరుచిం జెలంగు విలసద్భవదీయయశోవధూటి యా
శాతటరంగభూములను జానుగఁ జిందులు ద్రొక్కు[2] సజ్జగ
ద్గీతకులప్రసూతి పినతిమ్మయకొండ యఖండవిక్రమా. 444

చ. తలకొని యిచ్చి ప్రోడుపడు దాతలుఁ ద్రిమ్మరి పాదదాతలున్
జలకణమాత్రదాతలును జన్మము నెమ్ములు నిచ్చుదాతలున్
వెలవెలఁబోవు దాతలు భువిన్ బహుమార్గము నొందు దాతలున్
దెలియ సమంబుగారు పినతిమ్మనికొండని కివ్వసుంధరన్. 445

వ ఆరంగప్ప నేని వంశావతారం బెట్టి దనిన. 446

క. రంగక్షితిపతి సాక్షా
ద్రంగపతిం దెలిపె సతతదురంతైకదయా
సంగతి సాత్త్వికయుతబు
ద్ధిం గమలావిభవసంభృతిన్ బరికింపన్. 447

వ. అతనికుమారుండు. 448

సీ. ఈభోగవైభవం బేరాజు కున్నది
పాకారికే కాక నీకె కాక
ఈకాంతివిలసనం బేరాజు కున్నది
రాకేందునకె కాక నీకె కాక
ఈమహాగాంభీర్య మేరాజు కున్నది
నీరధికే కాక నీకె కాక
ఈధైర్యధుర్యత్వ మేరాజు కున్నది
నిర్జరాద్రికె కాక నీకె కాక
ధరణి నేరాజు కున్నదీ దానగరిమ
నాకభూజంబునకె[3] కాక నీకె కాక

---

1. A. B. పతి
2. A. బానంగగజందులుద్రొక్కు
B. బానంగగలందులుద్రొక్కు
3. A. B. నాకభూరుహజంబునకు

భావభవరూప భువనదీ। ప్తప్రతాప
సంగరాటోప వెలుగోటి । సింగభూప.[1] 449

సీ. ఒరయు విద్వేషుల । యూరు నాటకశాల
మెఱయు భూతగణంబు । మెట్టుకాండ్రు[2]
పగతుల నగరులు । పటురంగమధ్యంబు[3]
మలయు వైరుల ఱొమ్ము । మద్దెలయును
దట్టించు రిపుకోటి । తాళము లార్భటముల్
మజ్జారె[4] హేయను । మాటమాట
కోయని పెల్లార్పు। కొను నాగ ముఖవీణె
భవదీయభుజలక్ష్మి । పాత్ర గాఁగ
తక్కడిగి తక్కనఁగ[5] గీత। తాళగతుల
నాట్యమాడించు నీఖడ్గ। నట్టువుండు
బవరతలమున రంగభూ। పాలపుత్ర
సంగరాటోప[6] వెలుగోటి। సింగభూప. 450

వ. అతని కుమాళ్లు. 451

శా. ఔరా సింహతలాటరాయ భళి ని। త్యౌదార్యరాధేయ మ
జ్జారే సింగనృపాబ్ధిచంద్ర శుభవా। చాసాంద్ర సెబాసహో
రారాజద్వెలుగోటివంశమణి మేల్[7] । రా రామభద్రా గు[శ్రీ
నా] రీమన్మథ బాపు మాయురె మదాం। ధగ్రావవజ్రాయుధా. 452

ఉ. వీరనృపాలగర్వహర। విక్రముఁ డంటినొ జగ్గరాజను
ఖ్యారవిభాళుఁ డంటినొ భ। యాహృత[8] రాజకిశోరుఁ డంటినో

---

1. B. జంగభూప
2. A. B. ముట్టుకాండ్రు
3. ,, పగరులు నగరులు పటంగమధ్యంబు
4. ,, మచ్చారె
5. A. తక్కగిడితక్కనగ
   B. తక్కగిడితక్కనక
6. A. B. యంగజాటోప
7. B. మల్
8. A. B. దయాహృత

చారుతరాంగసింగనృపసంభవుఁ డంటినా కంతుచేతి పే
రారడి రామచంద్రుఁ డని యంటిని రం తొనరింతురా చెలీ. 453

వ. అతని యనుజుండు. 454

సీ. తుత్తుమురై రాలు ఘూర్త్రాణకోటీర
పాళీ[1] మణుల పాంసుకేళి నెఱపు[2]
ఏఱులై ప్రవహించు వీరవైరినృపాల
జాలరక్తంబుల నోలలాడు
వింతలై కనుపట్టు విద్విషిభూపాంత్ర
మాలికావళుల[3] నుయ్యాలలూఁగు
ఖండితోద్దండభూమండలాధిప[4] శిరః
కాండంబులను బుట్టచెండులాడు

మేలు మేలగు నీఖడ్గబాలకుండు
చటులతరకీర్తి నర్తకీనటనరంగ
రంగదాశాంత వెలుగోటిసింగవిభుని
వేంకటాద్రి క్షమాపాల విజయశీల. 455

సీ. గరిడిలో సాములా గర్వితాహితపాండ్య
దళవిభాళుని తోడి బలిమిపోరు
సరసప్రసంగమా సంగరనిశ్శంక[5]
బల్లరగండాంకుభటరవంబు
జలకేళులా సోమకుల భార్గవు కరాసి
ప్రవిగళద్రక్త[6] ధారారాళిఁ బడుట

---

1. A. B. పాలి
2. A. కేలిసెరవు
3. A. B. భూమాత్ర మాలికాలీల
4. ,, భూమండలాధిక
5. A. లిళ్యంక
   B. విశ్వంక
6. A. B. అలిగళద్రక్త

రత్న భూషణములా । ప్రతిగండభైరవు
నున్నత బాణకేతో గ్రరీతు
లేల యీవట్టి వైరంబు[1] । చాలు ననుచు
మన్న[2] రాజన్యు లెల్లను । మఱుఁగుఁ జొచ్చి
సిరులఁ బెంపొంది రౌరౌర[3] । సింగవిభుని
వేంకటాద్రిక్ష్మాపాల । విజయశీల. 456

వ. అతని కుమారుఁడు. 457

సీ. శ్రీరస్తు సకలధాత్రీచక్రరక్షణ
దక్షదక్షిణభుజాదండ నీకు
విజయోస్తు యాచకవ్రజ ఘోరదైన్యము
ద్రాతమఃపటల[4]మార్తాండ నీకు
హరిభక్తిరస్తు సాహంకారపరిపంథి
కంఠలుంఠనశాతఖడ్గ నీకు
[5]... ... ...
... ... ...
ఆయురస్తు సువైష్ణవాభ్యర్చనాభి
ధానమాధవమృదుపద[6]ధ్యానమానస
సాంబుజగరిమ వేంకటాధ్యక్షతనయ
మహాళి వెలుగోటిసింగభూపాల నీకు. 458

సీ. చివు చివుక్కున వచ్చుసింగాణికోలల
మదహస్తి నెదురఁగా । నుదుటు[7] చేసి

1. A. B. యీవంట్టివైరంబె
2. ,, మున్న
3. B. తౌకార
4. ,, ముద్రాతవి...రటల
5. The last line is missing
6. B. వలభ్రుదుద
7. A. B. నిదుట

ఱింగుఱింగనుచుఁ బాఱెడు తుపాకీగుండ్ల
నెఱి లెక్కగొనక ముందఱికు హెచ్చి[1]
బెఱబెఱమంచును - భీకరధ్వనులతోఁ
గవయు బల్బాణంబు - రవళిఁ గెరలి
మొత్తమై బలువాఁడి - కత్తుల నొప్పు రా
హుత్తసంఘములకై - నుఱికి నఱికి
మలక పంపుల గెలిచి తా - మాఱు లేక
రమణ నార్వీటి శ్రీరంగ - రాయశౌరి
సెలవుఁ బెట్టిన వెంగంటి - చెఱువులోన
ధీర వెలుగోటి వేంకటాధిపునిసింగ. 459

సీ. కఱకు సిలేదార్ల - కంఠరక్తంబులు
చండి వజీర్ల మాంసంబు తురుము
రవ్వగు నేదార్ల - క్రొవ్వు లప్పలరాసి
మెండౌ ఖాజీల[2] - మెదడు కుప్ప
బిరుదు రాహుత్తుల - ప్రేవుల ప్రోవులు
ఖండరిఖానుల - కండగుములు
గొంటరి సరదార్ల - గుండెల కఱకుట్లు
మొక్కలి[3] సైదుల - మూలుగులును
భుక్తి వెట్టితివో ఖడ్గభూతమునకు
గణన కెక్కిన వెంగంటి - రణమునందు
భళి భళిర పంచపాండియ - దళవిభాళ
ధీర వేలుగోటి వేంకటాధిపునిసింగ. 460

సీ. అల పురత్రయము ఘోరాజిలో వధియించు
శూలాయుధమహోగ్ర - లీల మెఱసి

---

1. A. B. నెరిలెక్కగానకముందఱికి నెచ్చి
2. ,, ఖాసాల
3. ,, దాక్కలి

అక్షీణబలుఁ డైన దక్షుని తలఁ ద్రుంచి
నిలిచిన శరభేశు నీటు దనరి
దశకంఠఖండనోద్దండుఁ డైనప్రతాప
రామభద్రస్వామి రహిఁ వహించి
క్రుద్ధకౌరవగదాయుద్ధమధ్యాటోప
భీమసేనాగ్రహోద్దామలీలఁ
బెకలి యినుమాఱు తరతరాలకును జాల
గుట్టు చెడఁ గొట్టితివి గోలకొండ బలము
తఱిమి వెలుగోటి వేంకట ధరణిధవుని
సింగధాత్రీకళత్ర యూర్జితచరిత్ర. 461

శా. నిన్నా మొన్నటి కన్నెమన్నెదొరలన్ నీతో సమానంబుగా
నెన్నేలా గెటు లద్భుతావహము[1] లూహింపంగ నీశౌర్యముం
భన్నానాగుణవైఖరుల్ భళి నుతింపన్ నీదిరా డాక మా
యన్నా వెల్గొటి[2] వేంకటాధిపునిసింగా సంగరాభంగురా. 462

మ. ఒకమన్నీఁడు కరాకరిన్ దొడరి నీహుర్మత్తు సైరించి నీఁ
గక[3] నిల్వంగలఁడా రణస్థలుల శంకాతంకముల్ లేని మ
న్నెకుమారుండవు నీవెరా రణజయోన్నిద్రా బుధాభీష్టదా
యక[4] మావెల్గొటి వేంకటాధిపునిసింగా సంగరాభంగురా. 463

శా. ధీరోదాత్తగుణోత్తరుండ వగు నిన్ దీవింప లేనట్టి యా
నోరున్ నోరె నినుం గనుంగొనని కన్నుల్ కన్నులే నీదయా
సారం బానని యర్థి యర్థియె మహీచక్రావనప్రక్రియో
దారాంభోధర[5] ఘోరసారశరధారాసార విస్ఫూర్జితుల్
గా రంతే వెలుగోటి వేంకటయసింగా మండలాఖండలా. 464

---

1. B. హావము
2. A. B. వెలుగోటి
3. ,, నేకక
4. ,, దాయన
5. ,, దారంభోధర

ఉ. క్రొత్తలుగాఁగ నేఁడు వెలుగోటిపురీంద్రకుమారసింగ మేల్
మొత్తము గట్టివచ్చు సిలెమూఁక వజీరులఁ గొట్టి మట్టినన్
నెత్తురు దొబ్బలున్ మెదడు నెమ్ములు ఱొమ్ముల మాంసఖండముల్
సత్తరు పెట్టిన ట్లమరు జంబుకవృద్ధపిశాచకోటికిన్. 465

సీ. పరవాహినీనాథపటుజీవనముఁ గ్రోలు
నీమండలాగ్రోరు[1] నీరదంబు
ద్విజరాజపోషణస్థితిఁ జెంది తనరారు
నీబాహుసురకుంభి నిగ్రహంబు
కువలయామోదంబు సవరించి విహరించు
నీకీర్తిచంద్రికోన్నిద్రమహిమ
పద్మాస్యవిలసనప్రాభవం బొనఁగూర్చు
నీప్రతాపద్యుమణిప్రకాశ
భళిర ! భవదుదారఖ్యాతిజలధిజలధ
రాయమానరాధేయాదిరాడ్విహార
భవ్యగుణహార వేంకటప్రభుకుమార
స్థిరతరాటోప వెలుగోటి సింగభూప. 466

సీ. తురగరింఖోద్ధూతధరణీపరాగంబు
జాళువాపనివింత చవికె గాఁగ
నిహతారిభూధవానేకాంగ[2]బృందంబు
విశదమౌ కల్యాణవేది గాఁగ
దళితోగ్రకరికుంభగళితముక్తావళుల్
శ్రీల[3] నొప్పెడు తలఁబ్రాలు గాఁగ
[4]... ... ...
... ... ...

1. B. గ్రారు
2. A. బాధితానేకాంగ
B. బాధితానేకోంగ
3. ,, శ్రీల
4. The last line is lost.

జయ రమాకరగ్రహణవిస్తారవిభవ
మాజి దాలుతు వెల్లప్ప[1] డవనిలోన
భవ్యగుణహార వేంకట ప్రభుకుమార
స్థిరతరాటోప వెలుగోటి సింగభూప. 467

వ. అతని యనుజుండు. 468

శా. పేటల్ కోటలు నుగ్గు నూచములు నీభేరీధణంధాణతన్
ధాటైనా భళి నీదె మన్నియము నేదారుల్ సమానంబుగా
బేటీ యందగ[2] నేర్తురే యని మొనం బెంపొందితౌ రయ్య వెల్
గోటీవేంకటరామభద్ర బుధరాట్కోటీరకల్పద్రుమా. 469

సీ. మత్తారిభూపాలమస్తకంబులె కాని
ఖండించ దార నీఘనకరాసి[3]
వైరిధాత్రీనాథవక్షంబులే కాని
వరుస మెట్టదు నీదువరహయంబు
విరసావనీంద్రుల వెన్నుపైనే కాని
తాఁకదు నీచేతి తఱటుపెట్టు
గర్వితాహితరాజగాత్రంబులే కాని
కాలరాయదు నీదు[4] గంధగజము

శత్రుమదభంగ రాయవేశ్యాభుజంగ
గండరాతీతబల్లరగండబిరుద
ప్రకటచారిత్ర వేంకటప్రభుసుపుత్ర
రమ్యగుణభద్ర వెలుగోటిరామభద్ర. 470

1. A. B. దాల్తు యెల్లప్ప
2. B. యందుగ
3. A. B. ఖండించవౌర నీ ఘనకరాళి
4. ,, ఖండించదౌర నీ

# అనుబంధము.

రేచర్లవారి బిరుదు.

స్వస్తి సమస్త సద్గుణగణాలంకార హేమాద్రి ప్రసిద్ధషోడశదాన మహామండలేశ్వర సకలవిద్యాకళాప్రవీణ శ్రీవిష్ణు[భక్తి]పరాయణ విరోధిరాజతిమిరమార్తాండ పూరితగాంభీర్యరత్నాకర పరనారీదూర మంగళార్థనిమిత్తభవన్మందిరనిత్యోత్సవ అనవరతకనకకర్పూర దానధారాప్రవాహ ఆరూఢతురగరేఖారేవంత వనితాజనహృదయవసవసంత ప్రతిగండభైరవ భుజబలభీమ ఖడ్గనారాయణ గాయగోపాళ హిందూరాయసురత్రాణ పంచపాండ్యదళవిభాళ కాకతిరాయరాజ్యస్థాపనాచార్య చలమర్తిగండ మూరురాయజగద్దళ కంచికవాటచూరకార క్రొత్తచెర్ల సర్వగర్వాపహరణ కొలనివీటిపిరక్షేత్రాణో విజయప్రమోద కుంట్లూరుభీమదేవునిశిరఃఖండన రణక్రీడావినోద నెల్లూరుపిరక్షేత్రాణో భారతీకమల్లతిక్కనబయ్యనప్రాణాపహార తిరుకాళరాజరాజ్యస్థాపనాచార్య ఉద్దండమండలీకరగండ సత్యగదేవునితలగొండగండ కన్నడదేవునితలగొండగండ చాళిక్యదేవునితలగొండగండ కంకాళదేవునితలగొండగండ ఉదయనదేవునితలగొండగండ వేములకొండరణరంగస్థల వైరినాయకజీమూతపవన ఏకశిలానగరసమీపశాత్రవరాజన్యగహనదావానల బెండపూడివిభాళ నెల్లూరిపిరక్షేత్రాణోహల్లకల్లోల కుంట్లూరిఇమ్మడిమనవిదారణ కారణప్రభవ అరిరాయమీనజాల రాజదేవేంద్రవల్లభ జిలుగుపల్లిసంగరాంగణరణోన్ముఖమచ్చనాయకునితలగొండగండ వైరిసామంతరాగోల కొదమనాయంకరగండ గణపవరదుర్గవిభాళ యిందిరాలాలప్రాకార[విభాళ] దన్నాలకోటపరివేష్టితకదనపారగ చేకోలుగండ ఇరువత్తుగండగండగోపాల రిపురాయమానమర్దన మెఱుకవరప్రాంతసమరసన్నాహ ప్రతికూలతిమిరమార్తాండ చేకోలుగండ కొలచెలమసప్తాంగచూరకార గోసంగిమర్గమదాపహార యినుగొర్తినిర్ధూమధామ జల్లిపల్లిపిరక్షేత్రాణోభారతీకమల్ల అంతెంబరగండ నానావర్ణమండలీకరగండ బిరుసుమన్నెవిభాళ ధరణీవరాహచౌహత్తమల్ల వరిగొండదుర్గవిభాళ కర్ణాటరాయమానమర్దనభుజాదండ సత్తికతప్పవరాయరగండ భాషగెతప్పవరాయరగండ మండలీకభుజంగ సంగర

# అనుబంధము.

వైనతేయ భుజబలాంజనేయ గిరిదుర్గమల్ల జలదుర్గబడబానల వనదుర్గదావానల
స్థలదుర్గవిభాళ హంకారరాజకుమారవేశ్యాభుజంగ త్రిభువనకోటలగొంగ
హొన్నకొట్టుకుదిటెగట్టుమండలీకరగండ హేల్లావరనంట హేల్లావరదగండ
వర్ణాశ్రమప్రతిపాలనోదయ ప్రజమెచ్చుగండ మున్నూడిబల్లరిగండ జాణకొమార
వివేకనారాయణ ప్రతాపరామావతార ఉన్మత్తరాయమదనమహేశ్వర పని
ఘానరాయబసవశంకర ఉన్మత్తమదనమోహన వశీకరణసంతాప కామినీపంచ
బాణావతార మృగమదఘనసారవివిధసుగంధకుసుమవిచిత్రచీనిచీనాంబరమౌక్తిక
వజ్రవైడూర్యగోమేధికపుష్యరాగఇంద్రనీలమరకతమాణిక్యప్రవాళనవరత్నస్థాపిత
సువర్ణభూషణాలంకార అసిముసలకణయకంపణ భల్లాతకభిండివాలకోదండశరచక్ర
క్రకచకుంత కుఠారతోమరపరశువజ్రముష్టికత్తివెరకత్తిసబళకదళపూనిలాంగల
కేరళావోడ్యాణపలకసురియ యత్తళపల్లసడోంకెనబల్లకత్తిరాయకత్తిత్రిశూల
బత్తీసాయుధప్రవీణ ఏకధాటీసమర్థ విషముధాటీపాంచాల చతురుపాయ
దక్ష రిపుప్రళయాంతకోపేంద్ర అష్టదిగ్గాజమనోభయంకర అవఘళరాయమాన
మర్దన మేదినీరాయకష్టగజాంకుశ శరణాగతరాజరక్షామణి ఆదిరాజాన్వయచారు
చరిత్ర రేచర్లగోత్రపవిత్ర వీరపాండ్యవిక్రమపాండ్యపరాక్రమపాండ్యసుందర
పాండ్యకులశేఖరపాండ్యులు మొదలైన పంచపాండ్యదళవిభాళ కూటువమన్నె
కుమాళ్లగుండెదిగుల హంకారరాజకుమాళ్లవేశ్యాభుజంగ గర్వితరాచకుమాళ్ల
వేశ్యాభుజంగ యేబిరుదూరగండ సర్వబిరుదకొమర వేశ్యాభుజంగ దళరావుదళ
పతిరావుదళమోదిత్యాందళపతిరాయాంచాళ్ళమ్మా పోడవనిపోటునుపెట్టనిత్యాగ
మునుపొగడించుకొనెనాయుకాంచాళ్ళమ్మా నవలక్షదాతా చక్రవర్తి ఐశ్వర్య
దేవతా విష్ణు[భక్తి]పరాయణ సింహతలాట రాయరాహుత్తవేశ్యాభుజంగ
నిచ్చకల్యాణపచ్చతోరణము నుగలిగిన రేచర్లనాయకకులాన్వయబిరుద విజయ
ప్రశస్తి విజయీభవ.

Printed by Rao Brothers (Regd), at Shakti Press Ltd. (Shanti Press), Madras.

# వెలుగోటివారి వంశావళి.

## సూచిక:

(సంకేతాక్షరములు: త.=తమ్ముఁడు; పు.=పుత్త్రుఁడు; బి.=బిరుదు; భా.=భార్య.)

---

## తప్పొప్పుల పట్టిక

| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 4 | రెండేడ్లఁ | రెండేళ్లు (రెండునాగళ్ళని అర్థము) |
| 6 | 4 | రేటేటు | రేఁటేఁటు |
| ,, | 5 | డనునొప్పు | డనియొప్పు |
| 8 | 18 | బెడెంబు | బెండెంబు |
| ,, | ,, | నాడు | నాఁడు |
| 29 | 5 | మాదడిందు | మాదఁడిందు |
| ,, | 6 | నెదకి | వెదకి |
| 32 | ,, | ఝంగిలి | జంగిలి |
| 35 | 11 | తొత్తడిఁగాపురంబు | తొత్తడిగాఁపురంబు |
| 38 | 2 | బరగఁ | బరఁగఁ |
| ,, | 12 | ఎరుక | ఎఱుక |
| 62 | 16 | మర్థికిపట్టు | మర్థికిఁబట్టు |
| 68 | 18 | జేదు | జేఁదు |
| 88 | 14 | శుద్ధవితి | శుద్ధచవితి |

---

# INDEX TO INTRODUCTION

The following abbreviations are used :—*ch.* = chief ; *chron.* = chronicle ; *co.* = country ; *com.* = community ; *dyn.* = dynasty ; *gen.* = general ; *hist.* = historical ; *k.* = king ; *lit.* = literary ; *rel.* = religious ; *ri.* = river ; *s.a.* = same as ; *sans.* = sanskrit ; *tel.* = telugu ; *tn.* = town ; *vi.* = village ; *wk.* = work.

L



M



N

## S



## T



## U



## V

W



Y



